

శ్రీ తెన్నేటి విశ్వనాథము షష్టిపూర్తి ఆహ్వాన సంఘము. 16 - 10 - 55

శ్రీ

# సరస్వతీసామ్రాజ్యము

(నిర్వచనము)

జమ్మలమడక మాధవరాయశర్మ

శ్రీ తెన్నేటి విశ్వనాథ షష్ఠిపూర్తి ప్రచురణము

శ్రీ తెన్నేటి విశ్వనాథము షష్ఠిపూర్తి అభినందన సంపుటము. 16 - 10 - 55



సామ్రాజ్యశ్రీః సరస్వత్యాః ధార్యతాం హృది శ్రీమతా
స్వాస్పంద సంవిదుల్లాస ప్రఖ్యోపాఖ్య విలాసినీ
షట్యబ్ద పూర్తి మహిత ! శ్రీ ధీ విజ్ఞాన భాసుర !
శ్రీవిశ్వనాథ ! భద్రం తే గ్రంథః పుత్రోస్తుభావితః.

పితృమాన్ మమ గ్రంథోయం విశ్వనాథేన ధీమతా
పుత్రీ చ నిశ్వనాథోఽయం గ్రంథేనాత్తసుగంధినా
కౌండిన్య శ్రీవత్స గోత్రౌ ప్రాప్త సంబంధ భాసురౌ
మాధవ శ్రీ విశ్వనాథౌ భా రతౌ భా రతే రతౌ.



# ప రి చ య ము

శ్రీయుత తెన్నేటి విశ్వనాథుల షష్టిపూర్తి ఆర్షా ధునిక సార సరస్వతీ సామ్రాజ్య ధ్వజ పతాకము. వేయి ముఖముల భారత భారతి ప్రతిభా భాసమానమైనది. పండితులు, కవులు, విమర్శకులు, రాజకీయ వేత్తలు వేదవిదులు సరస్వతీ సభారంగము నలంకరించి షష్టిపూర్తి పరిమళప్రభా పరమేశ్వరులయిన శ్రీ విశ్వనాథుల చటులమేధాప్రతిభాతిభాంశములకుం బ్రతిరూపులై యఖండవైభవమునకు గుదురు కల్పించిరి.

హృదయమార్దవములయిన స్నిగ్ధగౌరవభావములకు బ్రతీకములుగా నెందఱో కవులు గ్రంథముల రచించి విశ్వనాథుని కృతినాథునిగ నొనర్చి మురిసిరి. వారిలో బహుశ్రుతులు, సంస్కృతాంధ్రభాషా కోవిదులు మధుర వక్తలు నయిన జమ్ములమడక మాధవరాయశర్మగారు తమ నిరుపమాన సౌహృద సంపద విశ్వనాథులపట్ల వ్యక్తమొనరింపంగా నొనర్చిన దీ సరస్వతీ సామ్రాజ్య కృతి.

నిజమునకిది సరస్వతీసామ్రాజ్యమే. సరస్వతీసామ్రాజ్యము షష్ట్యధికవిషయ పరిశోభితము. అనంత షష్టిగుణభరితము. నిరంతర భాషాకృషిసస్యఫలము. సర్వజనాదరణీయము. సారవివేక పరిష్కృతము. అమూల్యము, అఖిలజనారాధ్యము విశ్వశ్రేయోమూలము.

శ్రీ మాధవరామశర్మగారు జగమెరిగిన దిట్టలు. శ్రీ పంతులు వారును లోకమెఱిగినవారు. ఈ కృతి వారి యుభయుల స్నేహమునకే కాక సారస్వతారాధనపరుల కెల్లరకును శోభ ప్రతిపాదియగుగాక.

శ్రీ తెన్నేటి విశ్వనాథుల షష్టికృతులు ఎనిమిది. వానిని క్రమముగా షష్టిపూర్తి సంఘమువారు ప్రచురించుచుండిరి. ఇప్పటికి వెలువడిన కృతులలో నిది మొదటిది. ఒండు రెండు ముద్రణాలయమున సిద్ధముగనున్నవి. అచిరకాలమున నన్నియు ముద్రింపబడగలవు.

గుణముచే నుత్తమతములయిన నాకృతుల కర్తలకు షష్టిపూర్తి సంఘము వారెంతయో ఋణపడియున్నారు. అమూల్యములగు కృతుల నొసంగిన నీపండితుల కేదియొసంగినను నయ్యది ఆర్థికదృష్ట్యా అనర్హమైనట్టిదే. షష్టిపూర్తి సంఘమువారు వారికి కృతజ్ఞతాపూర్వక నమశ్శతంబుల నొనరించుచున్నారు. కృతిపతుల కృతికర్తల భగవంతుడు రక్షించుగాక.

ఇట్లు

షష్టిపూర్తి సంఘము

శ్రీ

# సరస్వతీ సామ్రాజ్య విషయ గౌరవము


| | | | |
|---|---|---|---|
| ౧ | ప్రేయస్సు శ్రేయస్సు | | 1 |
| ౨ | పురుషార్థ సామరస్యము | | 2 |
| ౩ | వాఙ్మయ సరస్వతి | | 3 |
| ౪ | భారతామ్నాయము | | 4 |
| ౫ | భోగమోక్షములు | | 5 |
| ౬ | తేజోమయీ వాక్ | | 6 |
| ౭ | విప్లవానంతర వ్యవస్థ | | 7 |
| ౮ | సర్వలోక సుఖకాంక్ష | | 8 |
| ౯ | అవిరోధ దృష్టి | | 9 |
| ౧౦ | మిత్రచక్షువు | | 10 |
| ౧౧ | ఆర్ష ప్రతిభ | | 10 |
| ౧౨ | అష్టవిధ రాజ్యములు | | 11 |
| ౧౩ | సామ్రాజ్యము | 1 | 1 |
| ౧౪ | భోజ్యము | 2 | 12 |
| ౧౫ | స్వారాజ్యము | 3 | 12 |
| ౧౬ | వైరాజ్యము | 4 | 13 |
| ౧౭ | పారమాష్ఠ్య రాజ్యము | 5 | 13 |
| ౧౮ | మహారాజ్యము | 6 | 14 |
| ౧౯ | ఆధిపత్య రాజ్యము | 7 | 14 |

| | | |
|---|---|---|
| ౨౦ | సమంతపర్యాయరాజ్యము 8 | 15 |
| ౨౧ | స్వస్వరాజ్య యత్నము | 15 |
| ౨౨ | యోగ జీవనము | 16 |
| ౨౩ | సమన్వయ తంత్రము | 17 |
| ౨౪ | సర్వశక్తుల కలయిక | 18 |
| ౨౫ | అనేకములం దేకత్వము | 19 |
| ౨౬ | సామ్రాజ్య నిర్వచనము | 20 |
| ౨౭ | రాజసూయ యోగశక్తి | 21 |
| ౨౮ | స్వాత్మ సరస్వతి | 22 |
| ౨౯ | చతుర్ముఖ సరస్వతి | 23 |
| ౩౦ | అధ్యక్ష సరస్వతి | 24 |
| ౩౧ | సంఖ్యా సరస్వతి | 25 |
| ౩౨ | పతి పత్నీ భావము | 27 |
| ౩౩ | అహావర్ణా విర్భావము | 28 |
| ౩౪ | సంఖ్యాక్షర సంబంధము | 29 |
| ౩౫ | శబ్దబ్రహ్మ | 28 |
| ౩౬ | ఆది వర్ణములు | 32 |
| ౩౭ | వేద సరస్వతి | 33 |
| ౩౮ | తేజనము | 34 |
| ౩౯ | అపౌరుషేయత | 35 |
| ౪౦ | వేదమునుండిసృష్టి | 35 |
| ౪౧ | ఊర్ధ్వ బిందువు | 36 |

| | | |
|---|---|---|
| ౪౨ | వేదముల అనంతత | 36 |
| ౪౩ | సామ్రాజ్ఞీభవ! | 38 |
| ౪౪ | అవిద్వేషము | 39 |
| ౪౫ | మీమాంసా సరస్వతి | 40 |
| ౪౬ | వైయాకరణ సరస్వతి | 42 |
| ౪౭ | ఉపాసనా సరస్వతి | 44 |
| ౪౮ | గాయత్రీ భావము | 46 |
| ౪౯ | జపసంఖ్య | 48 |
| ౫౦ | శబ్దసాధనము | 49 |
| ౫౧ | శరీరవీణ | 50 |
| ౫౨ | సంవిత్సంచలనము | 51 |
| ౫౩ | ఆగమ సరస్వతి | 52 |
| ౫౪ | సాహిత్య సరస్వతి | 53 |
| ౫౫ | శబ్దశక్తులు | 54 |
| ౫౬ | కావ్యామృతము | 55 |
| ౫౭ | గానసరస్వతి | 57 |
| ౫౮ | గాన రసము | 59 |
| ౫౯ | వర్తమానరీతి | 59 |
| ౬౦ | గాంధర్వగానము | 61 |
| ౬౧ | స్వరభాగ్యము | 62 |
| ౬౨ | ఛందస్సరస్వతి | 64 |
| ౬౩ | ధీశ్రీస్త్రీ | 66 |

శ్రీ

# సరస్వతీ సామ్రాజ్యము

## ప్రేయస్సు, శ్రేయస్సు.

శ్రీ సరస్వతి విశ్వమయముగా నున్నది. విశ్వమంతయు నిండియున్నది. విశ్వ మతిక్రమించి యున్నది. చేతన మచేతనము సర్వము సరస్వతీ విలాసము. బ్రహ్మాండ మంతయు సరస్వతీ ప్రసారము. ఆ సరస్వతి యంతట నున్నను అందరకు అంతట గోచరము కాదు. అంతట అందరకు గోచరమగుటకై సరస్వతి ప్రసరించినది. సరస్వతీ ప్రసారము వ్యక్తముగ నున్నది. అవ్యక్తముగ నున్నది. కొన్నిట వ్యక్తతరముగ వ్యక్తతమముగ గూడ సరస్వతి యవభాసించుచున్నది. ఆసరస్వతి వ్యాప్తిని ప్రసారమును మనము గుర్తింపవలెను. అప్పుడు మన కిహము పరము లభించును. ప్రేయస్సు సిద్ధించును. శ్రేయస్సును కలుగును. సర్వవిధము లయిన యిహలోక సుఖములను ప్రేయస్సందురు. ఆత్మసిద్ధిని శ్రేయస్సందురు. దీనిని ముమ్మందు విస్తరించెదము. కొందరు కేవలము ప్రేయస్సును కాంక్షింతురు. అందుకై యత్నింతురు. అది భౌతికప్రజ్ఞను మాత్రము కలుగజేయును. అభౌతికములయిన పరవిశేషము లందుండవు. కొందరు కేవలము

శ్రేయస్సు నభిలషింతురు. యత్నించి సాధింతురు. వారలౌకిక మయిన ప్రతిభకలవారగుదురు. ప్రజ్ఞా పరాకాష్ఠను పొందుదురు. వారిహాము చూడరు. లౌకిక మాదరింపలేరు. భౌతిక మపేక్షింపలేరు.

## పురుషార్థ సామరస్యము

ఒక్క లౌకికము తగదు. కేవల పారలౌకికమును తగదు. రెండిటి సమన్వయము కావలెను. ఉభయసార మపేక్షితము. లౌకికమం దలౌకికము, అలౌకికమునందు లౌకికము జతగూడియుండుట లోకమునకు గావలయును. రెండిటి సమన్వయ సారమును సరస్వతీసారముగా, సరస్వతీప్రసారముగా, సరస్వతీ ప్రసాదముగా లోకము స్వీకరింపవలసి యున్నది. అట్టి ప్రసాద సిద్ధికై సరస్వతీ సామ్రాజ్యమును విశ్వప్రపంచము కోరుచున్నది. సరస్వతీసామ్రాజ్య మహార్థమే మన పురుషార్థము లందు గోచరించును. ధర్మార్థ కామ మోక్షములు పురుషార్థములు. ఈనాల్గింటిని సమరసముగ సేవించుటనే భారతీయు లలవరచుకొనినారు. కేవల ధర్మసేవనము అర్థకామాదుల నణగించును. లోక వ్యవహారమును సరిగ సాగనీయదు. కేవల మర్థతంత్రము రాజనీతి కుపకారకము. దండనీతి కనుకూలము. యుద్ధనీతికి దోహదము. అది అట్టిది, ధర్మము నధర్మము చేయును. కేవల కామసేవనము నెవరు హర్షింతురు? అది సీమల దాటించును. ధర్మ

మును దారిలో నుండనీయదు. నీతిని గోతిలో త్రోయును. మోక్షదృష్టి కలుగజేయదు. విశృంఖలత నేర్పును. లోకతంత్రమును అతంత్రముగ అస్వతంత్రముగ జేయును. కేవల మోక్షరసికత్వము కూడ ధర్మాదుల నీరసింపజేయును. లోక వ్యవహారమును అవ్యవహార్యముగా జేయును. అర్థ కామ ముల నంటనీయదు. కావున లోకము ధర్మార్థ కామమోక్ష ముల నాల్గింటిని కలియగలుపుకొని సేవింప దలచును. అను కూలవ్రతముగా స్వీకరింప దలచును. అవి పరస్పర మవిరుద్ధ ముగ నుండునట్లు సమన్వయించుకొని ప్రజ్ఞాశూరులు సేవింతురు. అట్టి సేవనమె మనకు కావలయును. దానినె మన పూర్వులు మనకునేర్పిరి. ఈనేర్పు సరస్వతీ సామ్రాజ్యమున లభించునని మన విశ్వాసము.

## వా ఙ్మ య స ర స్వ తి

భారతీయుల పెన్నిధానము వేదరాశి. వేదరాశి విశ్వ భాండము నిండియున్నది. అది విశ్వాస ముల్లాసమునకు హేతువు. విశ్వప్రవృత్తుల కది మూలము. విశ్వాతీతమయిన విశేషమును వేదరాశి గోచరింప జేయును. వేదసరస్వతి ధర్మ బ్రహ్మ ప్రతిపాదకము. మన ప్రవృత్తుల నది నిరూపించును; రక్షించును. నివృత్తి జీవితము నందించును. వేదరాశి మనకు జీవితాయనము. వేదార్థములె మన పురాణేతిహాసము లందున్నవి. మహాభారత గ్రంథము మన జీవితభారమును

మోయుచున్నది. మహాభారతము భారతీయుల కందరకు ధర్మశాస్త్రము; నీతిశాస్త్రము; జ్ఞానశాస్త్రము; రాగశాస్త్రము; విరాగశాస్త్రము; మోక్షశాస్త్రము. అది కానిది లేదు. ఏసమయమున గాని భారతము మనకు ప్రాణము. "యన్న భారతే తన్న భారతే" భారతమున లేనిది భారతదేశమున లేదు; భారతదేశమున లేనిది భారతమున లేదని మన మనిపించుట సరస్వతీసామ్రాజ్యము ననుసరించుట. ధర్మాద్వైత తత్త్వమునిచ్చి భారత మంధజగమునకు విజ్ఞానాలోక

## భారతామ్నాయము

మిచ్చును. మహాభారతము శాస్త్రకావ్యము. భారతీయ దర్శనము. భారతీయ దర్పణము. విప్లవానంతర సమయమున నుదయించిన భారతము జగమున కొక వెలుగునిచ్చి లోకప్రాణము కాపాడినది. ఇప్పటి విప్లవానంతరమున గలిగిన ఒడుదుడుకులనుండి మనము విడివడుటకు మనలను చిరజీవులనుగ రక్షించుటకు భారతగ్రంథమును మనము మన సరస్వతీసామ్రాజ్యపీఠమున భద్రపఱచికొనినాము. అది దుర్విధానముల సమన్వయపఱచి సామరస్యము సంపాదించునని వైదేశికులు కూడ తలంచుచున్నారు. మానవుల కందర కది శాంత్యభ్యుదయముల కూర్పగలదు. జ్ఞాన విజ్ఞాన శృంఖలమున నది నియమింపగలదు. ఇప్పటి యీ ప్రజాప్రభు

త్వములో గణరాజ్యములో ప్రాజ్యస్యవస్థలో సరస్వతీ సామ్రా
జ్యవైభవము కావలసియున్నది.

## భోగమోక్షములు

భారతీయ మహావాఙ్మయ మంతయు త్రికాలాబా
ధ్యము. అదియొక కాలమునకు మాత్రము సంబంధించి
యున్నదనరాదు. ఆకాలమున ఈ కాలమున ఏకాలమున ఆ
వాఙ్మయము లోకరక్ష. కాలాబాధ్యమయిన తత్త్వము నది
యందించుచున్నది. అవసరాపేక్షితము నది నిరూపించు
చున్నది. ప్రేయస్సును శ్రేయస్సును జతపరచి భారతీయవా
ఙ్మయము ప్రబోధించును. భౌతికము లయిన యనంతభోగ
భాగ్యములు మనకు కావలయును. ఇహలోకసుఖసర్వస్వమును
మనము కాంక్షింతుము. నానావిధ భేదవిభేదములు కల
యీ యనంత మహాజగములో నొక యేకత్వమును మనము
గుర్తింపవలెను. అట్లు గుర్తించి పారమార్థికాత్మానంద
మును పొందుటకు మన మనవరతము ప్రయత్నింతుము. లోక
మునకు ప్రేయస్సు కావలయును. శ్రేయస్సు కావలయును.
రెండును కావలయును. శ్రేయఃప్రాప్తిని పరమప్రాప్తియని
యందరందురు. కేవలము ప్రేయస్సనెడు చిక్కువలలో
పడి శ్రేయస్సును మఱచిపోకుండుటకై మహాసరస్వతి నిత్యము
మనలను ప్రేరణ చేయుచున్నది. ప్రత్యణువునందును శ్రేయ
స్సిద్ధిని మనము గుర్తించుచున్నాము. భోగమేయున్న మోక్ష

ములేదు. మోక్షమేయున్న భోగములేదు. సరస్వతీసేవన తత్పరులకు భోగము మోక్షము రెండును గలవు.

యత్రాస్తి భోగో నచ తత్ర మోక్షః
యత్రాస్తి మోక్షో నచ తత్రభోగః
సరస్వతీసేవన తత్పరాణాం
భోగశ్చ మోక్షశ్చ కరస్థఏవ.

## తేజోమయీ వాక్

సరస్వతీరూపము వాగ్రూపము. వాక్కు తేజోమయము. తేజస్సు సర్వమూలము. సృష్టి సర్వస్వమంతయు తేజోధీనమై వచ్చినది. ఇంతటి వికాసముతో నున్న సృష్టి యం దంతట తేజస్సు లగ్నమైయున్నది. సులగ్నమైయున్నది. తేజస్సు వినా యేదియులేదు. అంతయు తేజోమయమగుట విజ్ఞానరహస్యము. రహస్యమేమి? అది విజ్ఞానతత్వము. వాగీశ్వరీ మహాతేజస్సు విశ్వ విశ్వములో అణువణువునందు నిండియున్నది. అన్నిటి కదియె స్పందమిచ్చుచున్నది. ప్రస్పందము ప్రసాదించుచున్నది. సరస్వతి విశ్వమయి. విశ్వమయు మయినను సరస్వతి విశ్వోత్తీర్ణమై యున్నది. సరస్వతీ తత్త్వమునం దిట్టి స్వరూపవిజ్ఞాన మున్నది. ఇదియొక మహాసంవేదనము.. ఈ సరస్వతీతత్త్వమునె సరస్వతీ సామ్రాజ్యమని యంటిమి. ఈసరస్వతీ సామ్రాజ్యవైభవము రెండువందల కోట్ల సంవత్సరములకు పూర్వము నుండియు

ప్రసరించుచునే యున్నది. దానిని గుర్తింప జేయుటకై మహావిశ్వములోని మానవులందరు యత్నించు చున్నారు. ఆ సామ్రాజ్య వైభవము నందుకొనుటకై యనేకు లనేకవిధముల ప్రయత్నించుచున్నారు. మేధావు లెందరో వాఖ్యానములొనర్చుచున్నారు. భాష్యముల పలుకుచున్నారు. అంతటనన్నిట భారతీయుల సరూపణసారము సర్వ సమర్థముగా నున్నది. సర్వమహత్తరముగా నున్నదని సర్వు లనుచున్నారు. మనము నట్లనగలుగుటకై సరస్వతీసామ్రాజ్యము కావలెను.

## విప్లవానంతర వ్యవస్థ

దేవాసుర సంగ్రామములు జరిగినవి. రాజ మహారాజుల యుద్ధములు రేగినవి. స్వార్థపరార్థుల సంఘర్షములు హెచ్చినవి. ధార్మికాధార్మిక కలహములు దుమ్మెత్తినవి. సధనాధనవాదములు పుట్టినవి. దైశిక వైదేశిక విరుద్ధభావములు కలిగినవి. ప్రాచ్య పాశ్చాత్య వైషమ్యము లుదయించినవి. అన్నిటియనంతరమున లోకమును నీతినియతి రీతులలోనుంచుటకు సుఖస్థితిలో గూర్చుటకు చక్కని వ్యవస్థ కలుగునట్లు చేయుటకు భారతభారతి సంస్కృత సరస్వతి యత్నించినది. తనయత్నము సఫలము చేసికొనినది. లోక మమార్గము విడిచి మార్గమున జేరినది. సరస్వతీ సామ్రాజ్యములోని స్వరూపమును స్వభావమును గుర్తించిన విద్వాంసులు మహాసంకల్పమున తమ కర్తవ్యమును పాలించిరి. అది యం

దరకు మాననీయ మయినది. అంతియేకాదు, లోకము దాని ననుసరించి యాత్మసంస్కారము సంపాదించినది. అనుకరించినది. ఆత్మతృప్తి వహించినది. వారేమనిరి ? వారిట్లనిరి.

పశ్యేమ శరదశ్శతం — జీవేమ శరదశ్శతం
నందామ శరదశ్శతం — మోదామ శరదశ్శతం
అజీతాఃస్యామ శరదశ్శతం —

పెక్కువత్సరములు మేము విజ్ఞానము సంపాదింతుము. అనంతకాలము జీవింతుము. లౌకికాలౌకికసుఖములన్నిటి ననుభవింతుము. ఎప్పుడు నేవిధముగను పరాజితులము కాకుండున ట్లుందుము. అని యనిరి. అట్లు పలుకుటయె కాదు. అట్లాచరించిరి. తాను తరించుట, యితరుల తరింపజేయుట సామ్రాజ్యభావము. అందరి కానందమందించి యందు తన యానందము నందుకొనుట సామ్రాజ్యభావము.

## సర్వలోకసుఖకాంక్ష

"లోకాః సమస్తాః సుఖినోభవంతు"

ఈ యుపాయాన్వేషణమె సరస్వతీ సామ్రాజ్యములోని ప్రక్రియ. సర్వలోక సర్వసుఖ సంపాదనయత్నమె, సరస్వతీ సామ్రాజ్యమున నున్నది. "లోకమున ప్రజాసముదాయశక్తు లుల్లసింప వలయును. ప్రజల వ్యక్తి శక్తులు వికసనమార్గమున ప్రవేశింపవలయును. వ్యక్తుల శక్తులు సముదాయ శక్తులతో

గూడుకొని సమాజశ్రేయమున కుపయోగించుగావుత ” మని సరస్వతీసామ్రాజ్యము చెప్పును. ఈసామ్రాజ్య మొక దివ్యావతారము. అయినను సమాజమును వ్యక్తిని ప్రబోధించును. ఉద్బోధించును. ఆ సామ్రాజ్య మున్ననే యీయుద్బోధము కలుగును. దీనికై సరస్వతీసామ్రాజ్యము నానారూపములు పొందును. నానాభావము లిచ్చును. మన సర్వస్వ మిచ్చును. నానావిధ విభాసితమై మన సర్వస్వమై మనయెదుట నున్నది. దానిని లోకము చూడ వలయును. చూడవలసిన చూపుతో చూడవలయును.

## అనిరోధదృష్టి

సంశ్రుతేన గమే మహి
మాశ్రుతేన విరోధిషి”

అని యథర్వణవేదము భావకర్తవ్యము నిరూపించినది. వేద సరస్వతీ వైభవముతో మేము కూడుకొనవలయును. వేదవాదముతో మేమెన్నడు విరోధము పడకుందుముగావుత. వేద సరస్వతి మమ్ము నడిపించును. మే మా మార్గమున సంచరింతుము. మమ్ము ప్రబోధించి ప్రవర్తింపజేయు వేదము నెన్నడు కాదనము.—ఒకడొకడు చూచుచునె చూడడు. వినుచునె వినడు. వాగ్యోగవిదుడు సరస్వతీ సామ్రాజ్యములో నుండువాడుగావున ఆతనికి శబ్దము తనకుతాను విప్పుకొని గోచరించును. జనులందరు వాగ్యోగ మవలంబింతురు గావుతమని సర

స్వతీసామ్రాజ్యము సూచించును. ఈ సరస్వతీ ప్రసారము పొందిన సహృదయుడు దృష్టికలవాడు అనుగ్రహదృష్టి కలవాడు కాగలడు. ఆతనిదృష్టి యది మిత్రదృష్టి. మిత్రదృష్టితో సర్వము చూడగలడు.

## మిత్రచక్షువు

మిత్రస్యాహంచక్షుషా
సర్వానిభూతాని సమీక్షే

మైత్రీభావముకల యీదృష్టితో నేను సర్వభూతముల చూడ గలనని సమీక్షింపగల నని యాత డాత్మవిశ్వాసమున నుండ గలడు. అట్లు సమీక్షింప గలనని భావించునాతడే జగత్క ళ్యాణము కూర్పగలడు. ప్రేయఃశ్రేయము లందింపగలడు. ఒకడు కేవలము స్వార్థుడు. తానె తినును. అన్యుల తిననీడు. అన్యుల తినును. అన్యులది తినును. మరియొక డన్యుల తిన నిచ్చును. తానును తినును. అన్యులుతినుటకు తనదియిచ్చును.

## ఆర్షప్రతిభ

అట్లిచ్చి యిచ్చి తా నాహారము విడుచును. వాడు ఋషి యగును. వాల్మీకి మహర్షియయ్యెను. మహాకావ్యము వ్రా సెను. లోకమునకది యీయవలసిన దంతయు నిచ్చినది. గ్రామనగరముల కైకమత్య మిచ్చినది. బాలవృద్ధుల కేక మతమిచ్చినది. కృషి యంత్ర సభ్యతలకు సమన్వయ మిచ్చినది.

నాగరారణ్య సంస్కృతుల కలియనిచ్చినది. వ్యక్తి సంఘములు కైకాదర్శ మిచ్చినది. రాజ ప్రజలకు సామరస్య మిచ్చినది. అది సామ్రాజ్యనిష్ఠ.

"ఋషే ! ప్రబుద్ధాసి వాగాత్మని బ్రహ్మణి
తద్బ్రూహి ! రామచరితం"

అని బ్రహ్మయె వాల్మీకి నాదేశించి యట్లు చేయించెను. ఋషి వాల్మీకికి వాగ్యోగము తెలిపి సరస్వతీ సామ్రాజ్యము సాక్షాత్కరించు కొనినాడు. ఆతడేమి యొనర్ప లేదు! లోకము తనకు కావలసినది యడుగుటయె యాలస్యముగా సరస్వతి యంతయు ప్రసాదించును. మన మడుగుటకు వాక్కు కలవారము కావలయును. అది మనకు "ఆవిరస్తు" వైదికసరస్వతి సర్వప్రదాయిని. అది యట్టిది. వేదసరస్వతి విశ్వప్రేమ చాటిచెప్పినది.

## అ ష్ట వి ధ రా జ్య ము లు

ఐతరేయ బ్రాహ్మణ మెనిమిది విధములలో నీరాజ్య శాసనరీతులను వర్ణించి సూచించినది. మనకా శాసన రీతులు కావలయునని మనము చిరకాలమునుండి కాంక్షించు చున్నాము. దుశ్శాసన రీతులను మన మభిలషించుటలేదు. మనకు వైదికసరస్వతి సూచించిన రాజ్యశాసనరీతులు కావల యునని మనమె చెప్పుదుము. ఆసరస్వతియె మనచే నట్లు చెప్పించి తీరును. ఆరీతులివిగో !

౧. సామ్రాజ్యము — అత్యాచారము లిందు లేవు. అన్యాయములు లేవు. ఆక్రమణములు లేవు. దమనములు లేవు. అణచిపెట్టుటలు లేవు. సమ్రాడ్ ధర్మము సామ్రాజ్యము. నిఖిలము సమదృష్టితో చూడగల పాలకుడు సమ్రాట్టు. దీని వైశద్యము ముందుముందు వ్యాఖ్యానింతుము.

౨. భోజ్యము — భోజ్యములగు రాజ్యములలో ప్రకృతిసహజము లయిన యవధు లుండును. ఇతరులకా రాజ్యమగమ్యముగ నుండును. మన భారతదేశ మట్టిది. ఇట్టిదేశపృథివి గతయౌవన కాదు. నిత్యయౌవన పృథివి సస్యశాలిని యగును. రత్నగర్భ యగును. భారతదేశము భోజ్యము. మన హిమవానుడు మనకురక్ష. మున్నూర్త్తుల సముద్రుడు మనకు రక్ష. భోజ్యరాజ్య శాసకు లన్యదేశములను బలముతో నాక్రమింపరు. ధర్మవిజయమున సమీాక్షింతురు. భోజ్యరాజ్యముపై నందఱకు కన్నుండును. వారందరిపొట్టల నిది నింపును. అది భోజ్యములోని త్యాగమహిమ.

౩. స్వారాజ్యము — ఆత్మశుద్ధి కిందు ప్రాధాన్యమున్నది. ఆత్మగుణముల నిందలి వ్యక్తు లారాధింతురు. యమనియమముల పాలనమునకిందు రూపమున్నది. అన్నియు కామరహితము లయిన వ్యవహారములై యిందుండును. చోరులకు, భ్రష్టులకు, వంచకులకు నిందు ప్రవేశములేదు. ప్రవేశము లేదనుట. అట్టివా రుదయింపరని భావము. తనరాజ్య

మున చోరులు లేరని జారులు లేరని చెప్పికొనగల సుప్ర భువు స్వారాజ్యపాలకుడు.

౪. వైరాజ్యము — ఈరాజ్యమున రాజుండడు. ఉండ వలసిన యవసరమును లేదు. జనసామాన్యులు శాసనకార్య ముల పరిశీలింతురు. మాన్యజనులు శాసనసరంగముల ప్రవే శింతురు. స్వార్థరహితముగా వీరందరు ప్రవర్తింతురు. విశి ష్టపురుషు డెవడో యొక డధికారియై శాసనముల చలాయిం చుట యిందుండదు.

౫. పారమేష్ఠ్య రాజ్యము — ఇదియె పరమేశ్వరరా జ్యము. దీనినే రామరాజ్య మనుదు, ఇంకేమేని యనుదు. దీని గౌరవము పోకుండునట్లనుడు. మానవుల భ్రమ ప్రమా దాది దోషములన్నియు నిందు నశించును. అర్థకామ పరా యణత్వముల కిం దవకాశము లేదు. సర్వమానవులు పరమే శ్వరముఖులై సంచరింతురు. సర్వమానవుల పరమేశ్వరదృ ష్టితో ప్రసన్నముగ వీక్షింతురు. మానవు లందరు పరమే శ్వరులగుదురు. అందరకు సమానాధికారము లుండును. ఉన్న యధికారములు పొందుటకు మానవులంద రధికారనిర్వ హణమునకు తగిన యర్హులగుదురు. వారి యోగ్యతయె యధికారము గ్రహించును. ఇందు పాలనాధికారముల నిర్వ హించువారలకు శాసన నియమనీతుల ననుసరించు వారలకు నిత్యము పరమేశ్వరు డన్నిట గోచరించు చుండును. పరమే

శ్వరుడే పాలించును. పాలకులు నిమిత్తమాత్రము. శాసకులచే నాతడె శాసనము చేయించును. ప్రజలు శాసనవర్తులు. నియమ ముల్లంఘించువా రెవరు నుండరు. ఇది యాదర్శముగా గణింపదగిన రాజ్యము. ఇది శ్రేయోరాజ్యము. ఇది ప్రేయోరాజ్యము. ఇది యుభయ రాజ్యము. ప్రజలందరు పరమస్థానమున నుండి నిత్యతుష్టు లగుదురు. ఇది పారమేష్ఠ్యము.

౬. మహారాజ్యము — ఎన్నియో చిన్నరాజ్యములు కలసి మహారాజ్యమగును. ఇది సంఘరాజ్యము. సర్వశక్తిశాలి. అందరుకూడి శాసనము చేసికొందురు. చిన్నరాజ్యములకిందు సమానార్హత యుండును. పంద్రెండు రాజుల కూటమునం దొకరాజు ధర్మనియమాను సారమున నందర ప్రవర్తింప జేయును. అన్నిరాజ్యములం దొక ధర్మనియమమునె యాదరణీయము చేయును. ఆరాజు సర్వమహానుడు. సర్వవిధముల స్వార్థము విడిచినత్యాగి. అతడు మహారాజు. ఆరాజ్యము మహారాజ్యము.

౭. ఆధిపత్యరాజ్యము — అందరు నిం దధికారులుగా నుందురు. అధిపతియొకడిందు సర్వాధికారి. ఆత డందరి యభీష్టములకు ప్రతినిధియగును. సమష్టిభావమున సర్వభావముల నాతడు స్వీకరించును. ఆతడు నిర్దేశించు శాసననియమములు సర్వజనుల ననుగ్రహించునవి యగును. సర్వజనుల సంతోష

పెట్టుట సుకరమా! ఇట్టి యశక్తిభావ మాతని మనసునకు రాదు. ఆతనికి స్వకీయమగు రాజకీయము లేదు. ప్రజాకీయమె యాతని రాజకీయము. ఈరాజ్యమున నుద్యోగులందరు శక్తి సంపన్ను లగుదురు. ఇందు దొరదొపిళ్ళుండవు. ఉంగరాల మొత్తిళ్ళుండవు. నియమావళి నంగీకరింపలేని యసమర్థు లుండరు. పాలకున కధిపతియని పేరుమాత్రము కాని యాత డందరు సేవింపవలసిన యుత్తమ సేవకుడు.

౮. సమంత పర్యాయరాజ్యము—సమంతులు సామంతులు, వీరుమాండలిక పాలకులు, మండలపాలకులు ముఖ్యపాలకాధీనులై యుందురు. పూర్వపు సూర్యవంశపాలకుల పాలనభాగ్య మిట్టిది. ఇట్టిపాలనమున రంజనము ముఖ్యధర్మము. ముఖ్యపాలకుని నిరంకుశవిధాన మిందుండదు.

ఈ రాజ్యాష్టకమును వైదిక సరస్వతి సూచించుచున్నది. ఇట్లు ఈసరస్వతీప్రభావ మందుకొని యిట్లందుము.

"వ్యచిష్ఠేబహుపాయ్యే
యతేమహి! స్వారాజ్యే"

## స్వారాజ్యయత్నము

సువిస్తీర్ణమయిన యీ స్వారాజ్యమును, అనేకులచే రక్షింపదగిన యీస్వరాజ్యమును, అనేకులకు పొందదగిన యీస్వారాజ్యమును మే మధిగమింతుము గావుత. ఇట్లని ఈనాడు

మనమెట్లుందుము ? మన మెట్లని యిట్లనగలుగుటకే సరస్వతీ సామ్రాజ్య ముపకరించును. ఉత్తుత్తమాటలతో ననుట భారతీయు లభ్యసించిన విద్యకాదు. భారతీయులు క్రియా శీలులు. అందులకే వారి యాగస్వరూపములు – యాగార్థము కేవలము పారలౌకికము కాదు. కేవల మైహికమునుగాదు. ఇహార్థపరార్థముల నది సమన్వయించును. లౌకిక బాధావ్యథ లను పోగొట్టి శక్తియుక్తులను సంపాదించి యిష్టాభీష్టసిద్ధు లను యాగసరస్వతి సంపాదించి యిచ్చును. మానవులందరు

## యాగ జీవనము

యాగజన్ములు. రాగయాగమె భోగయాగమె వారియు త్పత్తికి కారణమని యనిపించును గాని యదియొక యిచ్ఛా జ్ఞాన క్రియాశక్తుల కలయిక. యాగజన్ముల జీవనమంతయు నొక పవిత్రమయిన యాగద్రవ్యమగు హావిస్సు. వారు యజ్ఞార్థమె జీవింతురు. మానవుల క్రియాశక్తి భావసార మున నంతయు నిచ్చును. సరస్వతి సర్వప్రతినిధియై ప్రపంచ మున వైజ్ఞానికైక్యము కూర్చవలసి యున్నది. ఆ వైజ్ఞాని కైక్యఘటనము మహాభ్యుదయము – సాధించును. ఉత్త మాదర్శములతో సమైక్యము సాధించుటయే సరస్వతీసంక ల్పము. ఇట్టి సామ్రాజ్యపీఠమున లోకారాధనము లందుకొను సరస్వతి లోకమున ప్రసరింప నున్నది. మన సంప్రదాయ

మహాత్త్వమున నీ సరస్వతీ సామ్రాజ్యమును విశ్వవ్యాప్తము చేయుట మనయందరి కర్తవ్యము.

## సమన్వయతంత్రము

ఇది సమన్వయాత్మకమయిన సంపూర్ణోద్యమముగా రాణింపగలదు. అది కాదనుట, ఇదియే యనుట, "అదిగో! అది" యనుట ఈదృశములయిన ప్రేలుచూపులుం, ములుకు పొడుచుటలు ఇందుండవు. అనుకూలములకు ప్రతికూలము లకు సమీకృతమయిన యేక లక్ష్యముచూపి భారతకళ్యాణ మార్గ ముపదేశించుటయె సామ్రాజ్య సంకల్పము. బెదిరి పోయిన లోకశక్తులను కలియగలిపి ముడివేయుటయేముఖ్యము. నేడు భారత భవ్యభూమిలో రాష్ట్రీయమగు సమైక్యమునకు సముచితమయిన మహాభ్యుదయమునకు తగిన సహకారమిచ్చు సమాలోచనరీతియె యీ సామ్రాజ్యవిభూతి. కేవల భౌతిక విజ్ఞానము అసలు విజ్ఞానమునకే దూరము పోయినది. ఆ విజ్ఞానమునందు విజ్ఞానులకే విశ్వాసము సడలిపోవుచున్నది. ఆ విజ్ఞాన మహాప్రవాహములను మానవజాతి యెచటకు పోవు చున్నదో ప్రయోక్తలే గుర్తింపలేకున్నారు. భూతిగర్భమున జేరి విజ్ఞానము భూతావేశ మిచ్చుచున్నది. విశ్వాభ్యుదయ మును భౌతికవిజ్ఞానము ఒక మూలకు నెట్టివేయుచున్నది. దానివలన గలుగునట్టి యభ్యుదయము గండముగ నున్నది. అనభ్యుదయముగ నున్నది. విజ్ఞానశాస్త్రముపేరిట ప్రయోగ

ప్రక్రియలు మానవగమ్యము చూపలేక చూడలేక తట్టు మిట్టాడునపుడు సమన్వయము సరస్వతి కావలయును. భౌతిక మాధ్యాత్మికమును నిరోధించునది కారాదు. ఆధ్యాత్మికము భౌతికమును తిట్టిపోయరాదు, ధార్మికము రాజనీతిసఖ్యము పొందుగావుత. ఐహికము పారమార్థికము ముడి వేసికొను గావుత! ఇవి సరస్వతీమంజులాశీస్సులు. లోకమున విజ్ఞాన క్షేమము కలుగుటకే సామ్రాజ్యము యత్నించినది. విజ్ఞాన స్థానము జాతి కనర్థమునిచ్చును. విజ్ఞానుల కజ్ఞానులకడ్డముగా తెర యుండరాదు. ఆ తెరపై సరస్వతి వెలసియు భయము సంధానించును. అందుననె యప్పుడె రాష్ట్రీయాభ్యుదయ మావిర్భవించును. నానా దేశీయులు విప్లవానంతరమున పాత ప్రమాతులై స్వరూపము చూచుకొని సమన్వయమునకు యత్నించినారు. జాతినంతను సంఘటితము చేయుటకై యన్నిటిని సమన్వయించికొనినారు సమాజాభ్యున్నతికి పథము వేసినారు. భారత భారతి సరస్వతీ సామ్రాజ్యముగా నిట్టి సమరసంధానము నెప్పుడో చెప్పినది.

## సర్వశక్తుల కలయిక

ఇది యిప్పుడు చెప్పినదిగా మనము గుర్తించుట యుక్తము. ఇప్పుడు గూఢగుప్తము లయిన మానవ శక్తు లన్నియు సక్రమమయిన విధానమున, సముచిత మయిన విన్యాసమున వికసించు గావుత. సకలశక్తులకు కేంద్రస్థాన

మయిన మానవుడు చెదరిపోయిన తన శక్తులను, వికసింపని తనశక్తులను అనుకూలపఱచుకొని ప్రవర్తించుట కీ సరస్వతీ సామ్రాజ్యము యత్నించును. సరస్వతీప్రసాదమున నుత్సాహ శక్తి దీక్షగైకొని సర్వవిధశక్తుల వికాసమున ప్రజ్ఞావైభవమున ప్రతిభా పరాక్రమమున కర్తవ్యమున సమానశక్తులు కావలయుట ధర్మము.

## అనేకములందు ఏకత్వము

ఈ యనంత విశ్వసృష్టికి పూర్వ మద్వితీయమయిన యేకతత్త్వమె ప్రజ్ఞానఘనముగా నున్నది. ఆ యద్వితీయైక తత్త్వమె విశ్వసృష్టిలో ననంతమై గోచరించును. సాగరజల మఖండ మొక్కటియె తరంగముగా బుడగగా నురుగుగా కణముగా గోచరించును. అనంతములం దేకతత్త్వమును, భిన్నములం దభిన్నత్వమును సంపాదించుట సామ్రాజ్యరీతి. నానా భేదములనుండు వస్తువులు మూలతత్త్వాన్వేషణమున నొక విధముననె యుండును. మౌలికమయిన ఏక వస్తువుతో నివి నిర్మితములని తోచును. ఘటము, కుండ, బాన, పిడత, మూకుడు, చిప్ప, ప్రమిద యెన్ని యున్నను వాని మూలము మన్ను. హారకేయూర కటకాదు లెన్ని యున్నను వాని మూలము బంగార మొక్కటి. గొడ్డలి, సుత్తి, కత్తి, చాకు, బాకు, మేకు, నూది యెన్ని యున్నను వానిమూల మినుము మొక్కటి. అట్లె చరాచరాత్మకమయిన యీ యనంత

జగమున నెన్నియున్నను వానిమూలము సత్. గోచరించు నీభేదము లన్నియు వాచారంభణములు; వికారములు. అందు ననె యుపనిషత్తు "వాచారంభణం వికారో నామధేయం" అనినది. "మూలమన్విచ్ఛ" మూల మన్వేషింపు మనియు నుపదేశించినది. ఏకమూలాన్వేషణము లేక చెప్పువారిని పరిహసించినది. అభిన్నతత్త్వమును గుర్తించుకొనుటకు సరస్వతీ సామ్రాజ్యతత్త్వ మవగాహనము చేసికొందము. అట్టివిజ్ఞానోల్లాసమునకు శక్తుల వికసింప జేసికొందము. శక్తులనన్నిటిని కూడ గలుపుకొని సామ్రాజ్య మనుభవింతము.

## సామ్రాజ్య నిర్వచనము

"సమ్రాజః ధర్మః సామ్రాజ్యం" అని సామ్రాజ్యపద వ్యుత్పత్తి. సమ్రాట్ అగువాని ధర్మము సామ్రాజ్యము. ఏకవిధమగు పాలనము లేనపుడు దేశములో పాలకులు నానా మతు లగుదురు. స్వార్థమున యథేష్టముగా పాలింతురు. సైనిక చండశాసనములు పెట్టుదురు. వారిబుద్ధిలో ధర్మస్థానమున నర్థకామములు చేరును. లోకమున ననర్థము కలుగును. విభిన్నమతులు పాలకులది చూడరు. వారి నందరి నేకపాలనమున కనుకూలముగ జేయుటకై సమర్థుడగు మహాపాలకుడు కావలయును. అట్టి యస్వార్థు డుదయించి రాజుల నందరి నుద్బోధించి కలియ గట్టును. రాజసూయ యాగము చేయును. అంద రనుకూలు లగుదురు. ప్రాతి

కూల్యము విడనాడుదురు. ప్రతికూల ప్రవర్తనముల కప్పు డవకాశము లుండవు. అప్పటి క్రియాపాటవమున సమన్వయ చాతుర్యమున ప్రతిఘటనము లుండవు. అది యంతయు రాజసూయయాగ మహాప్రభావము.

## రాజసూయయాగశక్తి

రాజసూయయాగ దీక్షితుని యాజ్ఞికులా సందిపై కూర్చొనజేసి యాశీర్వచనములుపలికి కర్తవ్యముప దేశింతురు. "త్వం భరతోఽసి. సర్వేషాం రాజా" నీవు భరతుడవు. ప్రజలనందరిని రంజింప జేయువాడవు. రాజవు అందురు. నీవిద్దాని భరింపుము. ఇది నీకర్తవ్యము. అత డిక లోకము భరించును. భరతసంజ్ఞ కలవాడగును. ఏకపాలన దీక్షితుడు భరతుడు. భరతసంజ్ఞ కలిగి పాలించిన వారి పేరుతో ఈదేశము భారతదేశ మయినది. ఎందరో మహారాజులు భరతనామమున విరాజిల్లిరి. దేశమేకవిధమున సధర్మముగ పాలిత మయినది. అట్లు భరతుడయిన యేక పాలకుడు "సమ్రాట్". ఆతని విధానము సామ్రాజ్యము. సరస్వతీ సామ్రాజ్య మహార్థ మూహించుట కిదియొక నిదర్శనము.

అనంతరూప మయిన యీ మహావిశ్వమున మహా సరస్వతి యేకవిధానమిచ్చి సామ్రాజ్య వ్యవస్థ నేర్పఱచును. ఆసరస్వతీసామ్రాజ్యము సాంకేతికమయిన తత్త్వవిజృంభణము.

## స్వాత్మ సరస్వతి

శ్రీ రసాత్మసమారంభ సారసర్వస్వహేతవే
నమః సరస్వతీ భావసామ్రాజ్యానంద తేజసే.

మహాసరస్వతి రసమయి సార స్వరూప. ఈవిశ్వస్వర్గ మంతయు నొక మహా సమారంభము. ఇంత శుష్కనీ రసముగా గోచరించుచున్నను రసాత్మకము. రససారమయిన విశ్వసమారంభ సర్వస్వమున మహాసరస్వతిహేతువు. ఆసార స్వత మహాభావ మొక సామ్రాజ్యముగా మహా విశ్వమున భాసించును. అట్టిసామ్రాజ్యమున నొక యానంద తేజస్సు కలదు. మహాసరస్వతి యానంద తేజోఘన. ఆస్వానంద తేజస్సరస్వతికి నమోవాకము లర్పించుట మన ప్రథమవిధి. రసరూపమును ప్రసరించినతత్త్వము సరస్వతి. అట్లు ప్రసరించిన సరస్వతి ప్రపంచ స్వభావమయినది. ప్రపంచ స్వరూపమయినది. విశ్వాకృతిగా సరస్వతి గోచరించును. కాని సరస్వతి కేవల మట్టిదేకాదు. సరస్వతి విశ్వమయయై కూడ విశ్వోత్తీర్ణ స్వభావ. ఆసరస్వతి సామ్రాజ్యానంద తేజోమయి. సరస్వ తీని ధ్యానమునకై మనముగోష్ఠీబంధముల నిర్వహించుకొను చున్నాము. మన గోష్ఠీవిధానము లన్నియు సరస్వతీస్వభావ కములు, రసప్రపూర్ణములు. మహాసరస్వతీ ప్రతీకములు మనకంతట భాసించును. ఆలేఖ్యములలో సర్వత్ర సరస్వతిని

మనము సాక్షాత్కరించుకొందుము. దండి మహాకవి సరస్వతి నిట్లు స్తుతించినాడు

## చతుర్ముఖ సరస్వతి

చతుర్ముఖ ముఖాంభోజ వనహంసవధూర్మమ
మానసేరమతాం నిత్యం సర్వశుక్లా సరస్వతీ.

మహాసరస్వతి చతుర్ముఖ బ్రహ్మ ముఖములందుహంస సర్వశుక్ల. నా మానసమున నిత్యము రమించు గావుత. మానససరోవరమున విహరించు హంసలో విశిష్ట లక్షణము లుండును. మానససరోవిశేషములు సర్వలోక ప్రసిద్ధములు. మన మానసమును మానసమగునేని యాహంస విరమించక రమించును. సారోద్ధమయిన యీ శ్లోక మొక సూత్రము. దీనిభాష్యము మనకు భావనీయము. భావకుడయిన మానవు నందు శ్వాస ప్రశ్వాసరూపముగా హంస సరస్వతి నాలుగు స్థానము లందున్నది. ముఖమున గోచరమగు వైఖరీసరస్వతి, హృదయమున భాసించు మధ్యమాసరస్వతి, నాభియందున్న పశ్యంతీ సరస్వతి, మూలాధారమున నున్న పరాసరస్వతియని మనలోని వాగేశ్వరి సరస్వతి చతుర్విధస్వభావ. ఆ మహా సరస్వతి మాకు సాక్షాత్కరించు గావుత. అంతట గోచ రించునది యందరిచెవులకు సుగ్రాహమగునది యాహితవాదము. అది యసల నాహత. ఆ యనాహత సరస్వతి నిత్యమహా

సరస్వతి. అది మాయందు దవభాసించుగావున. ఈ సరస్వతి సర్వశుక్ల యని యాచార్యదండి యనుభవము. సరస్వతీనామ సంకేతమె సర్వశుక్లభావము సూచించును. సర్వశుక్లసరస్వతీ ధ్యానము సాత్వికసంపత్తికి నిదానము. నీలసరస్వతీ విశేష ములనిటుమీదట గుర్తింపగలము.

## అక్షరసరస్వతి

అధ్యక్ష సరస్వతిని సభారంభములందు సంభవింతుము. సర్వత్ర సరస్వతియె సభాధ్యక్ష పీఠాధ్యాసిని. అందువలనె యధ్యక్షపీఠమున కట్టి గౌరవము. అచట మన దృష్టులకును సరస్వతి ప్రత్యక్షసరస్వతి ప్రత్యక్షసరస్వతియె యధ్యక్షసరస్వతి. ప్రత్యక్ష సరస్వతీ సమక్షమున అక్షర సరస్వతీ సంభావనము సహృదయ సంతర్పకము. సచ్చిదానందమయుమయిన బ్రహ్మ సంకల్పమున బహురూప మయినది. బ్రహ్మ పరశివుడు. పర శివుడు మణిమయమహాదర్పణము. అందు విశ్వము సంక్రమించి నది. విశ్వ మెచటనో బింబరూపముగానుండి యీ దర్పణమున ప్రతిబింబించినదని తలచరాదు. ఇదియె బింబము. ఇదియె ప్రతిబింబము. రూపము సంక్రమించునట్లు శబ్దముకూడ ప్రతి సంక్రాంతమగును. సంవిన్నాథుడగు పరమేశ్వరుని బోధ గగనము. మహాబోధ గగనమునందే శబ్ద మావిర్భవించు చున్నది. అదియవిభాజ్యమయిన యఖండ మహాశబ్దము. విశ్వలీలా భాగ్యమున నందు వర్ణసర్గ మారంభ మయినది.

పరశివబ్రహ్మ తత్త్వము మహాబిందురూపము. ఆ బిందువు నుండి ౧, ౨, ౩, ౪, ౫, ౬, ౭, ౮, ౯ సంఖ్యా లావిర్భవించినవి. ఈ తొమ్మిది సంఖ్యలే మహాసృష్టికి మూలము. సంఖ్యాసృష్టి యెట్లు క్రమవికాసము పొందునో తొమ్మిదవ యెక్కము సూచించును. ఈ తొమ్మిదవ యెక్కములో సృష్టి రహస్య మిమిడియున్నది.

## సంఖ్యా సరస్వతి

| | | |
|---|---|---|
| ౯ | ౧ | ౦౯ |
| ౯ | ౨ | ౧౮ |
| ౯ | ౩ | ౨౭ |
| ౯ | ౪ | ౩౬ |
| ౯ | ౫ | ౪౫ |
| ౯ | ౬ | ౫౪ |
| ౯ | ౭ | ౬౩ |
| ౯ | ౮ | ౭౨ |
| ౯ | ౯ | ౮౧ |
| ౯ | ౧౦ | ౯౦ |

ఇందు పదివరుసలు కలవు. మొదట ౦౯ యున్నది. చివర ౯౦ యున్నది. మొదటిది సృష్ట్యారంభము. చివరిది సృష్టిపరిణామము. ఆరంభములోగాని పరిణామములో గాని తొమ్మిదిలో రూపభేదములేదు. భావభేదమున్నది.

మొదటిది సృష్టికి సమున్ముఖముగా నున్న స్థితి. చివరిది పూర్ణ మయిన సృష్టి. మధ్యలో నెనిమిదివర్గము లున్నవి. అవి మిశ్ర సంఖ్యారూపములు. ౧, ౨, ౩, ౪, ౫, ౬, ౭, ౮ వ సం ఖ్యలు ప్రతినియత సంబంధమున వరుసగా ౮, ౭, ౬, ౫, ౪, ౩, ౨, ౧ సంఖ్యలతో సంబంధించినవి. ఈ నియతమయిన సంబంధమె విశ్వక్రమమునకు, దారియయినది. ఈ కలయిక చూడగా రెండర్ధార్ధబిందువు లొక్క పూర్ణబిందువుగా సిద్ధ మయినరీతి భాసించును. సంఖ్యాధార మొకటియె సగమిటుగా సగమటుగా ప్రసరించి కలసినవిధానము గోచరించును. ముఖ ప్రతిముఖములు కలిసినట్లుండును. అనుకూల ప్రతికూలములు మేళనము పొందినట్లుండును.

| | |
|---|---|
| ౧౮ | ౫౪ |
| ౨౭ | ౬౩ |
| ౩౬ | ౭౨ |
| ౪౫ | ౮౧ |

ఈ నాలుగు నాలుగెనిమిది సంఖ్యాసృష్టిలోని విశేష ములు. వీనిలో నేజంటను కలిపినను తొమ్మిది సిద్ధమగును. ఇట్టి చిత్రత యితరములందు గానరాదు. సంఖ్యాసృష్టికి మూల మయిన బిందువును ప్రకాశవిమర్శాత్మకమయిన మిశ్రబిందువని యనవచ్చును. ఉపనిషత్తులందున్న "పురుషవిధ" స్వరూప మిదియె. అదియె "యానందమయాత్మ". ఆనందమయు పురు

షుషు సృష్టియందు జేరెను. పరస్పరసంశ్లేషాత్మకముయిన "అర్థబృగళ" ముగా నయ్యెను. నీళ్ళు మన్నులుపోసి బీజము పాతినప్పు డది యుబ్బి రెండు డిప్పలు గలిగియున్నట్లుండును. అది యర్ధబృగళాకృతి. ఈ మిశ్రబిందువయిన మానందమయు డుపనిషత్తులందు గోచరించును. ఈ తత్త్వమును మనము మహా సరస్వతి యనెదము. ఈ యర్థబృగళమున రెండురూపములు కలిగినవి. అవి ప్రకాశతనువు విమర్శతనువును " పతిశ్చ పత్నీచా భవతాం " అని యుపనిషత్తు.

## పతిపత్నీ భావము

పతిభావము నాలుగువిధము లయ్యెను. పత్నీభావము నాల్గు విధము లయ్యెను. ప్రకాశాంశ మధికముగా నున్నచో పురుషాత్మకసృష్టియని, విమర్శాంశ మధికముగా నున్నచో స్త్రీరూప సృష్టియని భావింతుముగదా! ఈ యెనిమిది సృష్టు లలో ప్రకాశవిమర్శ సామరస్య మున్నది. ౧౫, ౨౭, ౬, ౪౫ ఈ నాల్గింటిలో విమర్శాంశ మధికము. ౧ విమర్శ ౮ ప్రకాశము. ఇట్లే యితరములు. ౫౪, ౬౩, ౭౨, ౮౧ ఈ నాల్గింటిలో విమర్శాంశ మధికము ప్రకాశాంశముతక్కువ. విమర్శ స్వభావము మొదట తక్కువగానుండును. క్రమముగా నది యధికముగును. అది యధికముయినకొలది ప్రకాశాంశము విహీతమగు చుండును. ఇంతకును నాల్గు స్త్రీరూపములు నాల్గు పుంరూపములుగా విర్భావము పొందుట తెలియు

దగి యున్నది. స్త్రీపురుషుల దాంపత్య రూపమయిన సంబంధమునందును సజాతీయసంబంధమునందే సవత్వముపూర్ణత్వము నుండును.

౧౮, ౮౧

౨౭, ౭౨

౩౬, ౬౩

౪౫, ౫౪

ఈ నిరూపించిన సంబంధమునను సాజాత్యశోభ తగిన యోగసిద్ధి యున్నది. ఈ పతి పత్నీభావము కలతత్త్వమునకు "అహ" యని సంకేతనామ మున్నది. "తస్య అహరితి నామ" అని యుపనిషత్తు. అకారాదికము హకారాంతమయిన వర్ణసమామ్నాయము తదర్థము.

అకారాదికము హాకారాంతమయిన వర్ణసమామ్నాయము పరాశక్తి మహాసరస్వతి.

## అహ వర్ణావిర్భావము

స్ఫుటశివశక్తి సమాగమబీజాంకురరూపిణీ పరాశక్తిః
అణుతరరూపానుత్తర విమర్శలిపి లక్ష్యవిగ్రహాభాతి.

మహాసరస్వతి చిదానందేచ్ఛా జ్ఞానక్రియాస్వరూప. ఈ సరస్వతి శివాదిస్తంబపర్యంతముకల మహావిశ్వమునంత నావిర్భవింపజేయును. చిదానందరూపిణి సరస్వతి జ్ఞానక్రియా

శక్తుల సంయోగము విశ్వనిర్మాణౌచిత్యము కలదగు ననుట సంప్రదాయములందు ప్రసిద్ధము. ఈ సరస్వతి యత్యంతము సూక్ష్మస్వరూప - అనుత్తర విమర్శలిపి లక్ష్యవిగ్రహ. అనుత్తరము అకారము. విమర్శ 'హ' కారము. ఈ 'అహ' వర్ణములచే నా సరస్వతీ స్వరూపము గుర్తింపనగును. పరాసరస్వతి సమస్త వర్ణకదంబము నంతర్గర్భితము చేసికొనియున్నది. అందుననే అహమాత్మిక, అకారాది హకారాంత పంచాశద్వర్ణ రూపిణి. వర్ణములు, పదములు, మంత్రములు, కళలు, తత్త్వములు, భువనము లనెడు సమస్త ప్రపంచమునకు జనయిత్రియైయున్నది. సమస్తభూతాంతరాత్మయని పరాభట్టారికయని సరస్వతీసుధా ప్రసారభాజనులనిరి. ఈ యక్షరసరస్వతి అ-క-చ-ట-త-ప-య-శ వర్గములుగా నయినది. ఈ యష్టవర్గములు సంఖ్యా సృష్టిలో నిరూపించిన యష్టవర్గములతో సంబంధముకలవని సూక్ష్మగ్రాహ్యము.

## సంఖ్యాక్షర సంబంధము

సంఖ్యల కక్షరములకు సంబంధము కలదు. అకారాదిగా వెలువడిన వర్ణముల నియతసంఖ్యలసంబంధము పరిశీలింప గుప్తమయిన మహార్థమభివ్యక్తమగును. "ఆదినవ, కాదినవ, టాదినవ, పాదిపంచ, యాద్యష్ట" అను సంఖ్యా సూత్రానుసారముగా వర్ణములకు సంఖ్యాసంబంధ మున్నది.

ప్రాచీనులు పరిభాషించిన పదములలో సంఖ్యాపరమార్థము నిగూఢముగా నున్నది.

ర ౨, స ౭, మొత్తము ౯ యగును.
అ ౧, హ ౮, ,, ౯ ,,

బ్రహ్మపదములో బ ర హ మ వర్ణము లున్నవి. క్రమముగా వీని సంఖ్యలు ౩, ౨, ౮, ౫. వీని సంకలనమున ౧౮ యగును. వాని కూడికలో ౯ వచ్చును. ఇట్లంతట నవసిద్ధి యొక పరమార్థ రహస్యమైయున్నది.

స్ఫుటితా దరుణాద్బిందోః
నాదబ్రహ్మాంకురోరవో వ్యక్తః.

బిందువుగా నున్న బిందువు స్ఫురితమై యుచ్ఛూన మయినది. దానినుండి నాదబ్రహ్మాంకుర మావిర్భవించినది. నాదమన్నది సర్వశబ్దముల కుత్పత్తి హేతువగు వర్ణము. నాదాత్మకమగు వర్ణము నానా నాదములకు కూడలి. అన్ని నాదము లిందున్నవి. అవ్యక్తముగ నున్నవి. దాని స్వరూపమున కస్తమయము లేదు. అది యవ్యాహత స్వరూపము. అది యనాహత స్వభావము. నాదబ్రహ్మాంకుర మయిన యీరవమారవము వ్యక్తమయిన దనుట సర్వవర్ణావిర్భావ బీజ మభివ్యక్తమని తాత్పర్యము. అట్లు వెలువడిన నాదాత్మక మయిన ధ్వని "పరా - పశ్యంతీ - మధ్యమా - వైఖరీ రూపమున నాలుగు విధములు. ఇతరులు వినుటకు శక్యమగు

వాక్కు వైఖరి. ఇది ముఖ నిర్గతమై గోచరమగును. ఇది స్థూలమయిన బహిశ్చేతనలో నవభాసించును. మనలో మన మూహింప గలుగు హృదయగతమయిన వాణి మధ్యమ. ఇది యుపచేతనలో భాసించును. యోగులకు మాత్రము గోచరమగునది నాభీగత మగునది పశ్యంతీ వాక్కు. ఇది యంతశ్చేతనలో భాసించునది. మూలాధార స్థానమున నుండునది పరవాక్కు. ఇది శబ్దబ్రహ్మ సకలవాక్కుల కిది మూలము. దీని తెలియుటయే పరమావధి. సకల తాంత్రికులు దీనికై యత్నించిరి. వైఖరీ వాక్కు విస్తృతమై వ్యాపించినది. ప్రాణశక్తి ప్రేరితమై వెలువడువాక్కు కంఠ-తాలు-మూర్ధ-దంత-ఓష్ఠములందు వ్యక్తమై నానారూప మయినది. ఆయాస్థానప్రయత్న భేదమునను సరించి వర్ణముల వర్గీకరణము సిద్ధమయినది. ఆదివర్ణములు స్వరములు. స్వయం రాజమానములు. వీని ప్రకటనముతో నితరవర్ణముల యపేక్ష లేదు. కాదివర్ణములు వ్యంజనములు. ఇవి స్వర సంబంధమున చక్కగా సముచ్చరితములు కాగలవు. స్వరము లని చెప్పదగు వర్ణములలోనున్న క్రమము సాభిప్రాయము. సహేతుకము. ఆ క్రమమట్లే యుండును. అట్లే యుండ వలయును. ఇతరభాషా వర్ణక్రమమం దిట్టి యానుపూర్వీ భాగ్యములేదు. ఇట్టి మహార్థములేదు. ఈ యానుపూర్వీ రమ్యతకల భాషలన్నియు నేక కుటుంబ మర్యాద కలవని విశదము.

# ఆదివర్ణములు

అ - ఇ - ఉ అనునవి మూలము లయిన వర్ణములు. మహాసరస్వతి ప్రథమ ప్రసారము అనుత్తరరూపము. దాని నుండి "అ" యావిర్భవించినది. ఇచ్ఛాశక్తి హేతువుగా "ఇ" యావిర్భవించినది. జ్ఞానశక్తి ఉన్మేషమున "ఉ" యావిర్భవించినది. వీని దీర్ఘములందివి హేతువులనుట విశదము. సరస్వతీదేవి యిచ్ఛాశక్తి జ్ఞానశక్తుల సంచార క్రమమిట్టి వర్ణోదయ హేతువయినది. ఇక క్రియాశక్తి సమావేశములో చిత్ర విచిత్ర సృష్టి యంతయు నున్నది. ఇట్లే వర్ణోదయ శ్రీచింతనమంతయు దేవీప్రసాదావధుల నవగమింపజేయును. సర్గారంభములోని విపర్ణావిర్భావ మిట్టిది. మనలోని వర్ణా విర్భావమిట్టిది. అందరియందును వర్ణావిర్భావబీజ మిదియె. సామాన్యముగా వర్ణమూలాన్వేషణమున సాధకులు నాద పర్యంతము భావింతురు. అటుపై భావనములో నగోచర ములు గోచరించును. మనయందు దాయా నాదములు ప్రతి సంక్రాంతమగుచున్న విధానము లవభాసించును. అప్పుడు సకల భువనములలోని శబ్దస్థితి యంతయు నేక మూలమని విశ్వాస ముదయించును. విశ్వాసము సత్యమార్గము. సత్య మార్గసంచారులభ్రాంతులై తత్త్వము వ్యాఖ్యానింతురు. తత్త్వ వ్యాఖ్యానము విశ్వవిహార మొనర్పవలెనని యక్షరసరస్వతీ సంకల్పము. అక్షరదర్శన మొక యక్షరశ్రీవిలాసము. అక్షర

తపస్సాచరించు మంత్రద్రష్టాశీలుర ప్రత్యక్షరమందును స్వాత్మ చైతన్య మర్పించుచున్నారు. అక్షరమక్షరమందు గుప్తమయిన యమృతబిందువును స్వాదించి మంత్రచైతన్య మూర్తులయిన మహాభావుల యనుభవసారములు మనయం దవతరించు గావుత ! అంతర్దేహమునందు స్ఫురించు శబ్దస్పందమును ప్రతి మానవు డవగాహనము జేసికొనవలసిన సమయ మాసన్న మయినది.

## వేదసరస్వతి

భారతీయులకు భారతీయతా సంపాదకమయిన వేద రాశిననుసరించి సరస్వతీ సామ్రాజ్య మొకింత గ్రహింపవచ్చును. వేద మపౌరుషేయము. వేదమీశ్వర నిశ్శ్వసితము. జ్ఞానార్థకమయిన వేదము నిత్యము. నిత్యశబ్దమున నిత్యులు నిరూపింపజాలరు. వేదసరస్వతి బ్రహ్మస్పందము ఈ శక్తి. సచ్చిదానందాత్మకమయిన పరబ్రహ్మ మొదట శబ్దముగా వివర్తించును. ఆ శబ్దమె ప్రణవము. ప్రణవశబ్ద మనంతపథమున నిత్యప్రకాశముతో నున్నది. అందుననె వాక్కు. తేజోమయ మని యంటిమి. దానినుండియే వేదరాశి యావిర్భవించినది. ఆ వేదరాశి సకల్మష హృదయులయిన యార్షప్రతిభా సంపన్నులు స్వహృదయములం దవభాసింప జేసికొని యావిష్కరింప జేసికొనినారు. సంవిదాకాశమునందు స్వాత్మ

సమావేశమున నచటి నిత్యమయిన చేతనాత్మక వేదమంత్ర శబ్దమును తమయందు ప్రతిసంక్రమింప జేసికొని విశ్వచక్ర ప్రవృత్తిలీలకై మహర్షులు ప్రసాదించిన వేదసరస్వతి నెట్లు కీర్తింపగలము? మన ముచ్చరించు శబ్దము విద్యుదాత్మకముగా వియత్పథమున వ్యాపించుచున్నది. అట్లు వ్యాపించిన శబ్దమును పరిగ్రహింప గల యంత్ర మున్నచో గుర్తింప వచ్చునని "యాకాశవాణి" తెలియజెప్పుచున్నది.

## తేజనము

వాయు వేడువిధములు. అందొక్కటొకటి సప్తధా విభాగము పొందును. ఇవి నలుబదితొమ్మిది ప్రధాన భేదములు. భూమినంటి యొక విధమగు వాయుమండల మున్నది. ఏకాదశ యోజనములకు పైగా నున్న వాయుపథము వేరు. జ్యోతిశ్చక్రము పరివర్తింపజేయు వాయుతత్త్వ మనన్యాదృశము. ఆవహ వివహ ప్రవహ సంవహాది వాయువులన్నియు "తేజన" మను ప్రదేశమున నున్నవని వేదసరస్వతి తెలియజెప్పుచున్నది. ఈ తేజనమున కతీతమయిన యనంతమార్గమున వేదనాద మున్నది. అది యొక మహా సరస్వతీ సామ్రాజ్యము. రసమయి స్వరసమయి యయిన యీ నిత్య సరస్వతిని వేదఋషులావిష్కరింప జేసికొనినారు. అది వేదము. అది నిత్యము. దాని నపౌరుషేయమని కీర్తింతుము.

## అపౌరుషేయత

తస్య యజురేవశిరః ఋుగ్దక్షిణః పక్షః
సామోత్తరః పక్షః, అథర్వాంగిరసః పుచ్ఛం

అని వేదమునకు శిరః పక్ష పుచ్ఛ కల్పన మున్నది. ఈ యంశమున భాష్య మొనరించిన భగవత్పాద శంకరులు వేదనిత్యత్వమును వ్యవస్థాపితము చేసినారు. వేదరాశియందు దాత్తానుదాత్త స్వరితస్వరములు ముఖ్యములు. స్వర సహితము గనె వేదము నుచ్చరింపవలయును. స్వరమునగాని వర్ణమునగాని లోప ప్రమాదము లున్నచో నది ప్రత్యవాయము కలుగ జేయును. ఆహతధ్వని రూపమున నున్న వేదశబ్ద మనాహత ధ్వని ననుభవమున కందించును. స్వరసహిత మయినప్పుడె యీ విశేష మావిర్భవించును. వీణాతంత్రిపై గోటిమీటు వలన నొక స్పంద ముదయించును. నాదాత్మకమయిన యీ స్పందము సకల రాగ సంగీతములకు మూలము. అట్లే వేద శబ్దము స్వరమూలము. స్వర సహితమయిన వేదశబ్దము నుండియే సకల సృష్టి వచ్చినది.

## వేదము నుండి సృష్టి

ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః
అగ్నేరాపః, అద్భ్యః పృథివీ

అను వేద మంత్రార్థమును భావించినచో శబ్దమే సృష్టి హేతువనుట స్పష్టమగును. "భూః" అను శబ్దోచ్చారణమున

భూమి యుత్పన్నమయినదని యుపనిషత్సూక్తి. భూశబ్దము నకు భూపదార్థమునకు గల సంబంధమున భౌతిక శాస్త్ర విదులు పరిశీలింతురు.

## ఊర్ధ్వబిందువు

మానవుని నాభీకేంద్రమునకు బిందువన్న సంజ్ఞ కలదు. మానవుడు తన బైందవ శరీరమును గుర్తించుట ముఖ్యము. కేంద్రబిందు వూర్ధ్వగామియైనచో సహస్రార పర్యంతము వ్యాపించును. అప్పు డూర్ధ్వబిందు ప్రకాశము కలుగగలదు. అట్లూర్ధ్వబిందు ప్రకాశమున వేద మవభాసించును. అధో బిందు ప్రకాశమున లోక మవభాసించును. ఇది యంతయు యోగప్రజ్ఞానుసంధేయము. ఇట్టి తాంత్రిక మయిన గహన విషయము వేదరాశిలో నిగూహితమై యున్నది.

## వేదముల అనంతత

వేద సరస్వతి ప్రసరింపజేసిన విషయము లనంత ములు. వేదము లనంతములు. భరద్వాజుడు జీవితమంతయు వేదములకై తప మొనరించెను. ఇంద్రుడు సాక్షాత్కరించి "నీకు వేరొక జన్మ లభించిన నీవేమి చేయుదు?" వనెను. "ఈ జన్మలో వలె నా జన్మలో గూడ తప మొనరింతును. వేదాధ్యయన మొనరింతు" నని భరద్వాజు డనెను. "వేరొక జన్మ వచ్చిన ఏమి చేయుదువు?" అని యింద్రుడు మరల

ప్రశ్నించెను. "ఆ జన్మలో గూడ తపము చేయుదును. స్వాధ్యాయము యొనరింతును" అని భరద్వాజు డసంకోచముగా దృఢముగా బల్కెను. అప్పుడెదుట మూడు పర్వతము లున్నవి. "ఇంద్రుడు మూడు పర్వతముల నుండి మూడు గుప్పిళ్ళు పట్టి" నీవింతకాల మధ్య యనించినది, యిక నధ్యయనము చేయునది యీ మూడు గుప్పిళ్ళు మాత్రము. అవిగో వేద పర్వతములు" "అనంతా వై వేదాః" వేదముల యంత మెవరు గుర్తింతురు? ఈ మహా విశ్వమున సభ్యతమము మున యార్య వర్గము వేదముల నారాధించుకొని వేలు నత్సరములు వేలు గ్రంథములు రచించినది. శాస్త్రములు, ధర్మ శాస్త్రములు, పురాణములు, తంత్రములు, మహా సాహిత్యము సర్వవాఙ్మయము వేదముల ఛాయలు.

భారత మానవ జాతి కేపరిస్థితిలో గూడ నైరాశ్యము కలుగ కుండుటకై వేదార్థ పరిజ్ఞానమునకు మార్గ మేర్పడినది. "సరస్వతి ప్రేమచే వేదార్థము గోచరించునని ఋగ్వేద మని నది. వేద సరస్వతి పవిత్రము నుపాసించు వారలకు సాక్షాత్కరించునట!

సర్వేషాం తు నామాని కర్మాణి చ పృథక్ పృథక్
వేద శబ్దేభ్య ఏవాదౌ పృథక్ సంస్థాశ్చ నిర్మమే.

సర్వ జగముల సర్వప్రాణుల నామకర్మ వ్యవస్థ లనియు వేరు వేరుగా వేదముల నుండియె నిర్మితములయినవి. **వేదము**

లలుండలి నామకర్మ వ్యవస్థల ననుసరించి యైతిహాసిక వ్యక్తి నామకర్మ వ్యవస్థ లున్నవి.

"భూతం భవ్యం భవిష్యంచ సర్వం వేదాత్ ప్రసిద్ధ్యతి" నాటిది నేటిది యేనాటి దయిన వేదమువనే సిద్ధమగునని మను వనెను. యుగాంతాంతర్హిత వేదములను ఇతిహాసములను మహర్షులు తపమొనరించి పొందగలిగిరి. సమాధి దశలో ఋషుల యంతఃకరణమున దివ్యజ్ఞానజ్యోతి ప్రస్ఫురిత మయినది. వేదము లావిర్భవించినవి.

## సమ్రాజ్ఞీ భవ

సమ్రాజ్ఞీ శ్వసురే భవ! సమ్రాజ్ఞీశ్వశ్ర్వాం భవ!
ననాందరి సమ్రాజ్ఞీ భవ! సమ్రాజ్ఞీ అది దేవృషు

ఈ పవిత్ర మంత్రమును కళ్యాణ వేదికలందు పలుకుదురు. నవవధువున కిది యాదేశము. "కళ్యాణీ! నీవత్తిల్లు చేవి అత్తమామలు ఆడబిడ్డలు మరదు లందరిపై సమ్రాజ్ఞివి కమ్ము!" గృహ సరస్వతీ సామ్రాజ్యము గృహిణి కెట్లా దిష్టమైనదో యిం దభివ్యక్తమగును. ఋగ్వేదమున నైకమత్య సూక్త మున్నది. అది సంజ్ఞాన సూక్తము. ఈనాటి ప్రజారాజ్య భావములు ఈనాటి గణతంత్ర పర్యాలోచనములు సర్వములు వానిలో సూత్రీకృతములై భాసించుచున్నవి.

సంగచ్ఛధ్వం! సంవదధ్వం!
సంవోమనాంసి జానతాం!
దేవా భాగం యథా పూర్వే
సంజానానా ఉపాసతే

ఓహోహో! మేధావులూ! మీరందరు కలిసికొనుడు! ఒకరి నొకర వగాహనము చేసికొనుడు. మీ మనసు లన్నిటి కూడగట్టుకొనుడు! దేవతలందరేకమై తమ హవిస్సులందు కొనినట్లు మీరందరేకమై సంపాద్యము సంపాదింపుడు!

సహృదయం సాంమనస్యం
అవిద్వేషం కృణోమి వః
అన్యోఽన్య మభిహర్యత
వత్సం జాతమివాఘ్న్యా

మీరందరు ద్వేషము విడచి సహృదయతను సంమనస్కతను ప్రసరింప జేయుడు. గోవు తన దూడను ప్రేమించుచున్నది. అట్లు పరస్పరము ప్రేమభావులు కండు. వాఙ్మ్యాంతరిక్షములు, వీర వీరత్వములు, మృత్యువమృతములు, సత్యానృతములు, భూతభవ్యములు బెదరవు చెదరవు. అట్లే నా ప్రాణ మెప్పుడును బెదరక చెదరక యుండుగావుతమని యభయదానము వేదములందున్నది. రోగనాశకములు రాగవర్ధకములు భోగరూపకములు త్యాగనిరూపకములు సర్వప్రతిపాదకములు వేదసరస్వతిలో నున్నవి. వానిని పృథక్క

రించి లోకప్రబోధమున కందించుట వేదసరస్వతీ చరణా
రాధకుల కర్తవ్యకర్మ. అందుకొనుట లోకజనుల పవిత్రకర్మ.

## మీమాంసా సరస్వతి

మీమాంసకులామ్నాయార్థము నిశ్చయించుటకు యత్నించిరి. వీరి నిశ్చయమున శబ్దము నిత్యము, వారలకు శబ్దముకన్న నన్యములేదు. శబ్దమె దేవత. వేదమంత్రోచ్చారణమున ఆయా వర్ణముల యానుపూర్వి ముఖ్యము. యథాక్రమ సస్వరోచ్చారణ మపూర్వము సంపాదించును. దేవతలకే మేనిరూపమున్నదనిన నది యాయా శబ్దముల సముచ్చారణముననె సిద్ధమగునందురు. శబ్దము చేతనము. జైమినిమహర్షి పూర్వ మీమాంస నిరూపించెను. వేదము నిత్యత్వమును ప్రామాణికత్వమును నిరూపించెను. యజ్ఞతత్త్వము విశదముగా విచారించెను. పూర్వ మీమాంస పరిచయము లేకున్న వేద సరస్వతీ తత్త్వము స్పష్టగోచరముకాదు. పూర్వ మీమాంస కర్మమీమాంస ధర్మమీమాంస అధ్వరమీమాంస కర్మ కాండయజ్ఞవిద్య మొదలగునవి మీమాంసా పర్యాయములు. ప్రవృత్తి ధర్మనిరూపకమయిన వేదభాగములోని విశేషములను విపులముగా మీమాంస సరస్వతి వ్యాఖ్యానించినది. అనుష్ఠాన సమయమున వినియుక్తమగుచు ననుష్ఠేయార్థమును బోధించునది మంత్రమని మీమాంస నిరూపించును. శబ్దార్థముల సంబంధమౌత్పత్తికము. నిత్యము. అది కృత్రిమముకాదు.

సాంకేతికముకాదు. కేవలము శబ్దమె నిత్యమనుటకాదు. శబ్దా-శబ్దార్థముల సంబంధము, వాక్య వాక్యార్థముల సంబంధము బోధక బోధ్యముల సంబంధమును నిత్యము. ఈ సంబంధ మొకప్పుడు నిర్మించినదికాదు. అదియనాది. పరంపరా సంప్రాప్తము. వేదము స్వతః ప్రమాణమయినది. వేదము శాసించి చెప్పును. విధించును. కర్తవ్యమందు ప్రవృత్తిని కలుగజేయును. కర్తవ్యకార్య ముద్బోధించి సముచిత వినియోగము ప్రతిపాదించి, సమర్థాధికారిని నియమించి, యుక్తప్రయోగము నిరూపించు వేదవాదమును కాదనువారెవరుందురు? వేదోక్తయజ్ఞదానహోమాదులు ధర్మమని మీమాంస రాద్ధాంత మొనర్చినది. వేదసరస్వతీ స్వరూప రహస్యములను మీమాంస వేయి యధికరణములలో నిశ్చయించినది. మీమాంస సరస్వతీ స్వరూపరహస్యములను మీమాంస వేయి యధికరణములలో నిశ్చయించినది. మీమాంసా సరస్వతీ ప్రభావమొక వేద వాఙ్మయముననె కాదు. అదియంతట ప్రసరించినది. అందరు మీమాంసాధికరణముల నామోదించినారు. న్యాయస్థానము లధికరణమంటపము లయినవి. ధర్మ నిర్ణయములు మీమాంసా నిర్ణయములయినవి. అకర్మణ్యతాసిద్ధికై కర్మ కరణ ముద్బోధించి మీమాంసా సరస్వతి జగమును కర్మాసక్తము చేసినది. యజ్ఞరహస్యమును మీమాంసా దీనముగనె తెలియవలయును. యజ్ఞములందు వినియోగము పొందు పదార్థము లందెట్టి రాసాయనిక సిద్ధార్థము లున్నవో అవి

యెట్లిహ పరసిద్ధాంధు లగునో మనము గుర్తించి గుర్తించి జీవాయన మన్వేషింపగలము.

## వైయాకరణ సరస్వతి

వైయాకరణులు శబ్దైకజీవులు. వారికొక మాత్రా లాఘవముసిద్ధించినను పుత్రుడుదయించినంతగా సంతసింతురట!

" ఏకమాత్రాలాఘవే సపుత్రోత్సవం
మన్యంతే వైయాకరణాః"

శబ్దము వారి ప్రాణము. శబ్దమునువారు గుణమనరు. వారిమతమున శబ్దము ద్రవ్యము శబ్దములలోని భాగ ప్రతి భాగములను వారివలె సమీక్షించిన వారేరి ? బృహస్పతి దివ్యవర్ష సహస్రము దేవేంద్రునకు శబ్దరహస్య ముపోద్బోధించి నాడట. దేవతలందరు శబ్దముల వ్యాకరించి తెలియజెప్ప వలయునని దేవేంద్రుని కోరిరి. అప్పు డాతడు శబ్దముల భాగించి ప్రకృతియని ప్రత్యయమని యనేక విధముల వ్యాకరించి తెలియజెప్పినాడట.

## శబ్దము కామధేనువు

ఏకః శబ్దః సుప్రయుక్తః స్వర్గేలోకే
కామధుఖ్భవతి

ఒక శబ్దమునేని సుష్ఠుగా ప్రయోగించిన నది స్వర్గలోక మున కామములు పితుకునట, శబ్దోపాసకు లెంతటిపని చేయు

లేరు; శబ్దమునకు సంబంధించిన సుప్రయోగ విధానము సామ
ధానము గాని భాలసీయము. ప్రకృతి ప్రత్యయచక్ర క్రమము
లోని సాధూచ్చారణమె సుప్రయోగముకాదు. వైఖరీవాక్కు-
నుండి క్రమముగా పరావాక్కు- వఱకను సంధానము గావిం
చుట సుప్రయోగము. సుప్రయుక్త సరస్వతి కామధేనువు. 'భర
ద్వాజ మహర్షికి కామధేనువు కలదు. భరతసేనకు మహాభో
జనమేర్పఱచినాడు. వశిష్ఠుని కామధేనువు విశ్వామిత్రుని హోస
లగొట్టినది. జమదగ్ని కామధేనువు కార్తవీర్యుని వేయి
బాహువులను నరికివేసినది, ఈ కామధేనువులు మహర్షులు
శాసించిన సరస్వతీ స్వరూపములు. సుశబ్దప్రయోగమున పుణ్య
మదయించునని మహాభాష్యమని నది. వేదముఖము వ్యాకర
ణము, వ్యాకరణ మష్టవిధ స్ఫోటపద్ధతుల నంగీకరించును.
భగవానుడు భర్తృహరి వ్యాకరణమును స్ఫోటవాద సంబద్ధము
చేసి పరమార్థము వ్యక్తీకరించినాడు. వ్యాకరణము ధన్యమయి
నది. ఎనిమిది విధములయిన స్ఫోటములు నఖండ మహాస్ఫోట
మున నంతర్భాగములు. కాల్పనికములు. మహాస్ఫోటమొక్క-
టియె మహార్థము, పరమార్థము. మహాస్ఫోటమె మహారసము.
శబ్దబ్రహ్మ. నాదబ్రహ్మ దాని వివరములె పరాపశ్యంతీ మధ్య
మావైఖరీ రూపములు, శబ్దము తన నారాధించినవారికి తన
సౌభాగ్యమందించి ధన్యత నాపాదించును. ఒక కమనీయ
కామిని సుస్నాతయై సువస్త్రయై తనప్రియునకు స్వతనూభాగ్య

మనుభూతికై యర్పించినట్లు శబ్ద మారాధకునకు తన తనువును వివరించునట. ఈ వేదమంత్రము భావింపుడు.

ఉతో త్వస్మై తన్వం విసస్రే
జాయేవపత్య ఉశతీసువాసాః

ఈమంత్రార్థము కైయుట ప్రదీపములందును గోపాలిక స్ఫోటకారిక లందును విశదముగ వ్యాఖ్యాతము.

'నాపశబ్దితవైన మ్లేచ్ఛితవై
అవశ్యమాధ్యేయం వ్యాకరణం

అని మహాభాష్య కారుడనుచున్నాడు. అపశబ్దముల నుచ్చరింపకుండుటకు మ్లేచ్ఛులము కాకుండుటకు వ్యాకరణ మవశ్యమధ్యయనము చేయువలయునని యూశని యూహా, వైయాకరణులు శబ్దము నింతగా నింతకింతగా సంభావించి నారు. ధాతుప్రత్యయసంధి సమాసాది ద్వారమున వారొనర్చిన సరస్వతీసాధన మసాధారణము. వైయాకరణ సరస్వతీ సామ్రాజ్యమిట్లు సంస్కృతమున సుబద్ధమైయున్నవి. అదియె సర్వభాషలందును ప్రసరించినది. "జయతు సరస్వతీ". వ్యాకరణము వేదమునకు ముఖముకదా!

## ఉపాసనా సరస్వతి

సహజమయిన సరస్వతీ సంపూర్ణస్పష్టభావ ముపాసనలో గోచరించును. శివుడర్థము. శబ్దము శక్తి. ఆశబ్దమె

యుపాస్యము. జ్ఞానేంద్రియములకు గోచరించునే యంశముకాని శబ్దమాత్రైక శేషమై సాధకునిలో భాసించును. సర్వవిధములయిన రూపగంధాద్యుపాసనముల శబ్దోపాసనము నందే పర్యవసించును. ప్రణవశబ్దమె శబ్దము, శబ్దమునకు శబ్దనస్వభావమున్నది. ప్రణవమందు శబ్దనమున్నది. ప్రణవము నిత్యాలుప్త ప్రభావము. అమేయాచింత్య స్వభావము. అనంతపథమునం దవిచ్ఛిన్నమై ప్రణవనాదమనాహతస్వరాజమై యున్నది. ఆప్రణవమె సకలశబ్ద ప్రపంచ స్రోతస్సు. మంత్రము లన్నియు నందుండి యావిర్భవించినవి. వేదరాశి ప్రణవమునుండి యావిష్కారముపొందినది. సర్వమంత్రముల కావ్యస్పందము మహాగాయత్రి, తన నుపాసించు వారిని గాయత్రి రక్షించును, "గాయంతం త్రాయతి" గాయత్రీ మంత్రాక్షరము మానవునకు చైతన్యమూ ఘానించును. గుప్త గూఢములయిన యనంతశక్తుల నది వికసింపజేయును. మానవు డనేకశక్తులకు కేంద్రపీఠము. వాని క్రోడీ కారమున కాత డెంతేని యత్నింప వలసియున్నది. గాయత్రి యాయత్న సాఫల్య మాపాదించును. ఆ ధార్మిక విశేషములను గాయత్రి మనకు తెలియకుండగనే నశింపజేయును. అనాద్యవిచ్ఛిన్న మయిన మహాకాల ప్రవాహమున అగణనీయ మహామునుల యాత్మ చైతన్యముతో నది సంప్లుతమైయున్నది. గాయత్రి మంత్రమువలె నిరవచ్ఛిన్నసంపాత పవిత్రమయిన మంత్రము సృష్టిలో లేదనుట గాయత్రీ గౌరవము గావించుట. ఏమానవ

జాతి కిట్టిదిలేదు. ఏమానవునకు నిదిలేదు. సకలము పోయి నను మానవులకు పోనిది యిదియె. ఇదియె సర్వకాలములందు సకలమై సకలకలమై యుండును. ఇది యున్నందుననే భారతీయుడు భారతీయుడు. గాయత్రీబలమె సరస్వతీ సామ్రాజ్య వైభవము.

## గా య త్రి భా వ ము

పరబ్రహ్మ భట్టారకుని భావిశేషమున విశ్వసంచలన ప్రక్రియ సాగుచున్నది. సౌరమండలము సౌరశక్తి కలదై ప్రకాశించుట లోకము గుర్తించినది కాదా! ఈ సూర్యుడును మహాసూర్యుని ప్రకాశమున వెలుగుచున్నాడు. అందరి సూర్యులకు తేజశ్శక్తి నిచ్చి వెలుగు వేవెలుగు సూర్య సూర్యుని తేజస్సు పాసించుట గాయత్రీ మంత్ర మహస్సు. గుణమయ ప్రకృతి కతీతమయిన తేజస్సు నుపాసన విశేషమున మనకందించు గాయత్రి బ్రహ్మచారికి, గృహస్థునకు, వానప్రస్థునకు, యతికి నుపాస్యము. ఈ తులకిది యెట్లుపాస్య మగునో వివరించుట కీయతుల కధికారములేదు. రూపాంతరమున మూలస్రోతో రూపమున తురీయాశ్రమ గతులకును గాయత్రి యుపాస్య. ఉపనయనము మొదలుగా వటువుపదిష్ట గాయత్రి మంత్రుడై మంత్రసంస్కారముపొంది ద్విజుడై యనంతర విధానములం దధికృతుడగుచున్నాడు. గృహస్థు అగ్నియుపాసనము తోడుచేసికొని గాయత్రి నుపాసించును. వ్యక్తి

గృహస్థుడు వానప్రస్థుడు నిరంతర నిధ్యానమున గాయత్రి నుపాసించుచున్నాడు. గాయత్రినుపాసించు వానికి మంత్ర సిద్ధి యున్నది. గాయత్రి నుపాసించని వానికి మంత్రమున్నను మంత్రము లేదు. ఆతని మనన మెంతయున్నను మంత్రచైతన్యము లవలేశమేని యాతని కందదు.

ప్రకట గాయత్రి గాయత్రి గానందరకుపాస్యయగుచున్నది. ఉపాసనాధి కారముపొందిన వారలందర విశేషమున నుపాసింపవచ్చును. గుప్తగుప్తతర, గుప్తతమ స్వభావగాయత్రి సంప్రదాయమున తెలియగలిగిన మహాతత్త్వము. తనకు తెలియనీ! తెలియకపోని! ఉచ్ఛ్వాస నిశ్వాస రూపమున నొక హంస గాయత్రి సకలప్రాణులందును సంచరించుచున్నది. అప్రాణ పదార్థములందును అనంత వేగమున నణుగతమై యొక స్పందమున్నది. ఆస్పంద రూపమున గాయత్రి జడచేతనములందును గతమైయున్నది. సాంప్రదాయకులు గాయత్రీసరస్వతిని నిష్ఠాపరములై యుపాసింతురు. జపమును సంఖ్యానింతురు. సంఖ్యకు మాలధరింతురు. మాలలనేకములున్నవి. అందు వర్ణమాలిక యుత్తమరీతి. అకారాది క్షకారాంత వర్ణమాలిక ననుసరించి సృష్టిప్రక్రియలలో సంహారప్రక్రియలో గాయత్రినను సంధానించుట, వర్ణమయి మహాదేవిని ప్రజ్ఞానేత్రమున గోచరింపజేసికొని భావించుట సంప్రదాయమున గలదు. ఇష్ట మూర్తియందు దేవి నావాహితచేసి లయాంగకల్పనము చేయుట పూజాసంప్రదాయము లందున్నది. లీనావతనము

లను అలీనముచేయు నది మంత్రమయి మహాసరస్వతియని, యాసరస్వతి 'అహార్ణ' రూపయని సంప్రదాయమున మేము భావింతుము. వర్ణమయి యాసరస్వతి మాతృకయని ప్రసిద్ధి. "అజ్ఞాతా మాతా మాతృకా" జగన్మాతయె యీమాతృక. మాతృకాసంపద మానవుని సహస్రారమున నిత్యప్రతిష్ఠితమై యున్నది. ఆ సహస్రారవర్ణసంపదతో సమైక్యము సంపాదించుటకై వర్ణమాలా సంఖ్యానమున సాధకులు యత్నించుచున్నారు. నూరుగా, వేయియెనిమిదిగా, వేయినూటయెనిమిదిగా జపసంఖ్య నభిమానించువారున్నారు. ప్రాణశక్తి యుచ్ఛ్వాస నిశ్శ్వాసరూపముగా దినమున కెన్ని వేలపర్యాయములు సంచరించుచున్నదో యాసంఖ్య కనుకూలముగ నుండుటకై జపానుసంధానము చేయువారు నియతముగ పరిగణనమంగీకరించినారు. ఉపాస్యదేవీపాదద్యుతులు అగ్ని సూర్య చంద్రమయములై యున్నవి. ఆయాసంఖ్యానమునకు తగినట్లుగా జపసంఖ్యానముకలదు. ఈ సంప్రదాయ విశేషములను విస్తరించుటకు సంప్రదాయ బద్ధములయిన సమయగోష్ఠి బంధములుకలవు. మహాజపానుసంధానమున సాధకులు శమయందలి చంద్రమండలస్పందసుధల నాస్వాదించి యమృత సంతుష్టులగుదురు. మంత్రము మంత్రసంఖ్య మంత్రఫలము వీనిసంబంధ విశేషములను వైజ్ఞానికులు గుర్తింపగలుగుటకును సమయము నాదము వెలువడుచున్నది. విజ్ఞానశాస్త్రములకు మహత్త్వము కలుగుటకై గాయత్రీదేవి కటాక్షము ప్రసరింపజేయుగావుత!

## శబ్దసాధనము

ప్రకృత కాలికులు కొందరు తమ సంప్రదాయ విశేష
ముగా శబ్దసాధన మొనరించు వారున్నారు. అర్ధరాత్రమున
దక్షకర్ణమునందు నిరంతర ధారారూపముగా గోచరించు మహా
శబ్దము ననుసరించుటకు ఆసంప్రదాయము వారు యత్నించు
చున్నారు. ఆ శబ్దానుసంధాన మూపాసనా సరస్వతి యగును.
బాహిర శబ్దమునుగూడ వినుడు. ఏ భాషాశబ్దము నేని వినుడు.
అది యర్థవత్తు కానీ, కాకపోనీ, వినుడు. వినుటలోని నిరం
తర చిత్త ప్రవృత్తి, యేకాగ్రత కూర్చును. చిత్త లయము కలు
గును. చిల్లయము కలుగును. బాహిర శబ్దము లేక శ్రుతిలో
నుండవు. ఏకస్వరమున నుండవు. విశ్రుతి విస్వర విధానము
చిత్తలయమును కూర్చజాలకపోవచ్చును. బాహ్యశబ్దమునందలి
దోషములను పరిహరించుకొని యనుసంధాన మొనర్చుట
యుక్తము. దోషపరిహారిక మొక శబ్ద మనుసంధాన [illegible]మా
గ్యము. సముద్ర ఘోష మట్టిది. దాని నిరంతర శ్రుతి, విశ్రుతి
విస్వర దోషముల దూరీకరించును. లోశబ్దముల నుద్దేశింప
జేయును. బాహ్య శ్రుతులను దూరముపెట్టి యాంతరశబ్దమును
సంధానించుట సముచిత పద్ధతి. సర్వేంద్రియ ద్వారముల
పిధానించి దక్షకర్ణమున గోచరించు నాంతర ధ్వని వినుట
కలవడినచో చిత్తలయము కల్గును. అందే మేఘధ్వనులు
వినబడును. సాగర ఘోషములు విన్పడును. దశవిధనాదములు

గోచరించును. అనాహతము భాసించును. ప్రణవ మవభాసించును. సరస్వతీ సామ్రాజ్య మవభాసించును. ఇట్టి యను సంధాన యోగమును సురతయోగ మందురు. అనాహితమగు హృదయగత నాదమును నాదయోగద్వారమున తెలిసి కొనుటకై యత్నింతురు. ప్రాణమయిన దేహముయొక్క స్పందన రీతి వీణా తంత్రీ స్పందనముతో సాదృశ్యము కలిగి యున్నది. ఉపాసనాగత మయిన సరస్వతి యాత్మవీణా తంత్రుల నందింపజేసి మహానాద సరస్వతిని గోచరింపజేయును.

## శరీర వీణ

మానవులకు శరీర మొకవీణ. దేహస్థితి గతమయిన బ్రహ్మదండ మదియొక వీణాదండము. అందనేక నాడీసముదాయములను గతనులయి యున్నవి. వాని యనుకూల మేళనమున నవి స్పందింపగలవు. మహావీణ యొకటియున్నది. దానిని నాద సరస్వతీ సుభగ సుందరముగ బిగించి మేళవించినచో నది సుశ్లిష్టమగును. అప్పుడు దాని నాస్థాలించి ప్రయోగించినచో మహావీణలో స్పందము కలుగును. దాని నొక్కమారు ప్రయోగించినను మరుసటి దినమా సమయమునఁకది యట్లు స్పందించుచునే యుండును. మహావీణ నీనాడెట్లు దర్శింపగలము. ఆత్మవీణకు మహావీణకు సంబంధముగలదు. ఆత్మవీణాను సారమున మహావీణ నిర్మితము. ఆత్మవీణాతంత్రుల నాస్థాలించిన నది యొకనాడు ప్రమోగుటకాదు. అవ్యాహతముగా చిరకాల

మది యట్లు మ్రోగుచునే యుండును. స్పందించుచునే యుండును. ఇది యంతయు జాపకుల మంత్రచైతన్య ధారాశక్తులతో గూడియున్నది. ఉపనయనమునాడు మంత్రసంస్కారము గావించి బ్రహ్మోపదేశ మొనర్చు గురువు ఆత్మవీణను స్పందింప జేయుటకై గాయత్రి యుపదేశము నందించుచున్నాడు. అది యొక మహాస్పందమై జన్మావధి స్పందించుచునే యుండును.

## సంలిత్పంచలనము

దేహగతమయిన ప్రత్యణువునందును పరస్పరా సంకీర్ణ మేకముఖ మేకమూలమయిన స్పందన మున్నది. అన్నమయ దేహములోని యణువణు లిట్లు స్పందించుటకు మూలముగా నొక వాయుస్పందన మున్నది. అణువణువును వలయించి యా వాయువట్లు స్పందన శక్తిని కూర్చుచునే యుండును. ఆ వాయు స్పందనమందును మన మనస్సంకల్పము హేతువు. మనస్సంకల్ప ప్రభావ ప్రసారమున నిరంతరము వాయవీయాణువులు క్రమనియతిలో స్పందించును. మన మనస్సంకల్ప మచట నేరీతి యున్నదో స్థూలప్రజ్ఞ తెలియనీయదు. ఈ తెలియమి నానా విధమలావరణము. నిశ్చల ప్రజ్ఞావిశదమయిన బుద్ధిశక్తి మనసులోని సంకల్ప వికల్పములు హేతువు. బుద్ధిశక్తి మనసునకు సంకల్పశక్తులను కూర్చగా పూర్వోక్తమంతయు సాగుచున్నది. అన్నమయాణువులకు ప్రసరించి బుద్ధిశక్తిస్పందము మలావరణముల ఛేదించి క్షాళనము చేయును. అట్లొకింత శుద్ధస్వభా

వము లణువులన్నియు తమ స్పందవిలాసముల నూర్ధ్వముఖ ముల జేయగలవు. అవి యట్లు బుద్ధి ప్రభావితములగును. ఇంతటి మహాసంరంభమేల? యనుకొందుము. ప్రజ్ఞావైశద్యము కలుగగా నిదియంతయు నానందాన్వేషణ ప్రక్రియ యని భావింతుము. ఇట్టి ప్రక్రియాప్రవర్తనమె సరస్వతీ సామ్రాజ్యము. ఇది ప్రశాంతమయిన మహాశబ్దసాగరము. ఇది యనంతమయిన బోధగగనము. ఇది పరిధిలేని సంవిన్మండలము. సంవిన్మండల మహానేత్రి శ్రీ సరస్వతి సర్వసంచాలిక. ఇట్లు గుప్తముగానున్న తనలో నిశబ్దమును సంప్రదాయబద్ధమయిన నియమమున నుపాసనా సరస్వతి మాత్రమె యుద్ద్యోతింప జేయుగలదు. లోక వీణనుచూచి యాత్మవీణ తెలిసికొని సాధనపరిపాకము పొందువాడు విశ్వవీణా సంబంధము పొందగలడు. ఆత్మకుండలిని నారాధించువారు విశ్వకుండలిని తెలిసికొనగలరు. ఇట్లజ్ఞేయార్థములను సుజ్ఞేయముగా చేయగలగిన శక్తిస్పందము లుపాసనా సరస్వతిలో గలవు.

## ఆగమ సరస్వతి

శబ్దయోగము నాదయోగమన్నియునొకటి. ఇదియాగమగ్రంథములందు విశదముగా నిరూపణము పొందియున్నది. ఆగమ నిర్ణయానుసారముగా సరస్వతి నారాధించువారు రహస్యాగమాన్వేషణ ప్రగల్భులగుదురు. అట్టివారల వాగీశ్వరి కామధేనువు. వారికే జగమునగాని దుష్ప్రాపములేదు.

వశిష్ఠాదులకు కామధేనువు కలదంటిమి. వారి కామధేనువు కామధేనువె. వారి కామధేనువును ధేనువుకాదనము. ఇంక నిదియంటిమి, అందుము. కామధేను వయిన వాగీశ్వరి వార లకు కలదు. వారందరు సుప్రయోగించుచుపులు. సుప్రయుక్త సరస్వతి శబ్దశక్తి. అది మానవదేహబ్రహ్మాదంతము నందున్న సుషుమ్నాప్రవేశము పొంది యనాహతశబ్దమున నవగమింప జేయును. మంత్ర చైతన్యముతో ననాహత శబ్దము సుస్ప ష్టమై గోచరమగును. ఆగమసరస్వతి ననుసంధానము చేయు వారు ప్రకాశావభాసము పొందుదురు. ప్రాణవహ్ని సంయో గము వలన నాదము వెలువడును. న-ప్రాణము, ద-వహ్ని యందురు. నాదము కుండలినీశక్తిని షట్చక్రక్రమమున అమృత ధామము చేర్చుచున్నది. ఈయమృతానందప్రాప్తికై వేలకొలది వత్సరములు అసంఖ్యాక మహాఋషులు ఎన్నియో విధముల అను సంధాన మొనర్చుచున్నారు.

## సాహిత్య సరస్వతి

సాహిత్య సరస్వతి చిత్రవిచిత్రరమణీయ స్వరూప. కమనీయ స్వభావ. లలిత మంజులాలాప. సుజ్ఞేయగా గోచ రించును గాని సాహిత్య సరస్వతి దుర్జ్ఞేయ. ఆత్మవంతులకు గాని యీసరస్వతి సాక్షాత్కరింపదు.

"పరిభావయంత్యభితః, శబ్దబ్రహ్మవిదః
కవేః పరిణత ప్రజ్ఞస్సవాణీమిమాం"

## శబ్దశక్తులు

నేను శబ్దబ్రహ్మవిదుడను. పరిణతప్రజ్ఞుడను. కవిని నాయీ సరస్వతినందరంతట సంభావింపుడు" అని భవభూతి పల్కెను.

"విందేమహి తాం వాణీమమృతామాత్మనః కలాం"

ఆత్మకల. అమృతవాణి. ఆ సరస్వతిని మేము పొందుదుము గావుత. అనియు నాతడనినాడు. సాహిత్యవిదులు శబ్దవిశేషము ననుసంధానము చేయుదురు. వారక్షర తపస్వులు. సాహితీ మర్యాద ననుసరించి పరిశీలించిన శబ్దములందు మూడు శక్తులున్నట్లు గోచరించును. అభిధాలక్షణావ్యంజనలను నాశక్తులు సాహిత్య సరస్వతియందే స్పష్టరూపము పొందును. చెప్పవలచిన యర్థముల జెప్పుటకు సర్వశబ్దములు సమర్థములు కావు. కొన్ని శబ్దములకు మాత్రమె యట్టి సామర్థ్యముండును. అవి వ్యంజనా శక్తికల వ్యంజకశబ్దములు. అవి మాత్రమె వ్యంగ్యార్థమును బోధించును. ఆ వ్యంగ్యార్థమునె యావ్యంజక శబ్దమునె కవియగువాడు స్వీకరింపవలెనని యానందవర్ధనాదులను శాసనముచేసి చెప్పుచున్నారు. కావ్యమంతయు రమణీయార్థ ప్రతిపాదక శబ్దమయము. శబ్దమయమనుట నవియుపాసనామయమనుటయె. శబ్దవిదులు మాంత్రికులు. శబ్దగూఢార్థములను వారె గుర్తింపవలెను. కావ్యము వాగీశ్వరీమయము. కావ్యము కాంతాసమ్మితమని యాలంకారికు లందురు. కావ్యమునకు కాంతాసమ్మితత్వమును జెప్పుట

లోకకాంతలకది గౌరవము. ప్రతిపాఠకునకును కావ్యము తనకొక్క కాంత. లోకవిషయానుబంధము కలిగి లోక సంగ్రహ మొనర్చునదై కావ్యము స్వరూపశక్తికలిగి యున్న ప్పుడు కావ్యకాంత లోకకాంతయగును. అట్టి కావ్యమును భావించుటకు సహృదయ సామాజికులు సమర్థులు. కావ్య మందలి రసభావాస్వాదముచేయుటకు భావకులె కావలయును. అట్టి సామర్థ్యమును భావకత్వమును వారలకు కావ్యసరస్వతి ప్రసాదించును. అట్టి కావ్య సరస్వతీ సమాసాదిత ప్రజ్ఞా పాటవము కలిగిన కావ్యాస్వాదన మొనర్చువారల కందరకు కావ్యము శివకాంతా సమ్మితమయిన మహాసరస్వతి. శివ కాంత సర్వోపాస్య యావునను కావ్యముపదేశ మొనర్చునది యగును. శివకాంతా సముపదేశమును లోకము కావ్యద్వార మున పొంది ధన్యమగును. కావ్య మొనర్చునట్టి యుపదేశము మహాసరస్వతీ మంజులోపదేశము, జగమున నక్షర ముఖుల నందరిని సహృదయుల జేయవలయునని కవి యాత్మ కాంక్షించును.

## కా వ్యా మృ త ము

సహృదయుడు దేశకాలపాత్రావధులను దాటి సాధా రణ్యము సంపాదించును. అదివిశ్వజనీన మయిన యంతర్విద్యా సంబంధ విశేష స్వీకారపరిహారములు సహృదయున కక్కఱ లేదు. రాగద్వేషముల వాగురములలో నాతడు చిక్కు

పడదు. కావ్యామృతములాతని హృదయము మృదులీకరించును. మనోముకురము నిర్మలినముకాగా సర్వభావములను స్వాత్మసంవాదమున సహృదయుడే స్వీకరించును. వైదిక స్వరస్వతీ సంస్కృతీరంగమున జనతకు సుప్రవేశము కలుగ చేయుటకై కవికావ్య ప్రస్తాన మారంభించి సుకుమారోపాయము నిర్దేశించినాడు. అవి లుప్తవైదికస్మృతి కలుగుటకు సాహితి సకలయత్నము లొనరించును. త్రైలోక్య భావాను కీర్తనముగా శబ్దమయ సృష్టితో రూప మావిర్భవింప జేసి సాహితి సరస్వతీ సర్వస్వము ప్రసాదించినది.

ధర్మార్థకామ మోక్షేషు వైచక్షణ్యంకలాసుచ.
కరోతికీర్తిం ప్రీతించ సాధుకావ్యనిషేవణం

సాధుకావ్యమును సేవించుట సర్వపురుషార్థము లందు సర్వకళలందును విచక్షణత్వ మిచ్చును. కీర్తి నిచ్చును. ప్రీతి నిచ్చును. సాహితీ సమారాధకులు అటునిటు ముందు వెనుక క్రిందమీద షణ్ముఖులగుదురు. షడ్దర్శనులగుదురు. మత్రప్రజ్ఞులగుదురు. పామరులను మధ్యములను ఉత్తములను ఉత్తమోత్తములను అనుత్తములను అందరిని సమ రంగమున జేర్ప గలుగు సాహితి యుపదేశము సుకుమార మధురము. సాహిత్య సరస్వతి నాట్యసరస్వతి భిన్నభిన్న స్వభావకాదు. నాట్యము, ఆహార్యమాంగికము వాచికము సాత్వికమునను నాలుగువిధములగు నభినయముల సామరస్యముతో నుండును. అస్లే

సాహిత్యమును చతుర్విధాభినయ సామరస్యముతో నున్న ట్టుల తెలియవలెను. ఇదిమూలమాత్రముగా విపుల విషయ మును విశదముగా వ్యాఖ్యానించి తెలియుట యత్యంత మా వశ్యకము.

## గానసరస్వతి

నాట్యసరస్వతిలోని వాచికాభినయము పృథగ్రూపము పొంది గాన సరస్వతిగా మనకు ప్రత్యక్షమగుచున్నది. వాద్య సరస్వతి, గాత్ర సరస్వతిగా గానసరస్వతి ద్వివిధ. వణుకు లేక యొదుగుతనము కలిగి శ్రుతిసుభగ స్వరమండలములను ప్రకా శింప జేయు రాగరక్తుల కంఠములనుండి గాత్ర సరస్వతిగా చెప్పదగిన గాన సరస్వతి యావిర్భవించును. వాద్యములందలి స్వరమండలము భిన్నభిన్నస్వభావమున విశ్వమంతయు నిండి నది. రివ్వున జువ్వున వీచు గాలిలో, చిటపటపడు చినుకుల నడులలో టప టపమను పిట్టల జంటల రెక్కల చప్పుళ్ళలో తాళగతులు వాద్యరీతులు భరతునకు భాసించినవి. గాన సర స్వతి యేరూపముననున్నను మహాప్రభావ సముపేతమై విశ్వ మంతయు విహరించును. విశ్వదర్పణమునందు ప్రపంచము లోని ప్రాణుల రూపములన్నియు ప్రతిబింబించునట్లు విశ్వాకా శమున విశ్వనాదములు ప్రతి సంక్రాంతము లగును. ఏశబ్ద మేని సముచ్చార సమయముననె విశ్వమంతయు వ్యాపించును. ఎన్నిశబ్దములు విశ్వభాండములో మేళనముపొందినను రొద

యేమాత్రము కలుగక పోవుటకో సరస్వతీ సామ్రాజ్యమె హేతువు,

పాఠ్యాదథధ్రువా గానాత్సర్వతః పూరితే రసే
తదాస్వాదభరైకాగ్రః హృష్యత్యంతర్ముఖః క్షణం
తతో నిర్విషయస్యాస్య స్వరూపావస్థితౌ నిజః
వ్యజ్యతే హ్లాదనిష్యందో యేనతృప్యంతి యోగినః

పాఠ్యమువలనగాని, ధ్రువాగానమువలనగాని, రసరాగములు సంపూరితములై వ్యాపించును. అపుడు వాని యాస్వాదభరమున సహృదయుం డేకాగ్రచిత్తు డగును. క్షణమంతర్ముఖుడై హర్షము పొందును. విగళిత వేద్యాంతరుడగును. ప్రసన్నాంతఃకరణుడగును. అట్లంతర్ముఖుడై ప్రసన్న భావుడగుటవలన సహృదయా స్వాదయితకు స్వానంద స్వరూపమైనసంవిన్మయావస్థ కలుగును. దానిచే నాతని చిత్తమున నొక నిర్వృతి యుదయించును. స్వీయానంద నిష్యంద మాతనికి ప్రకాశించును. గానయోగమున సాహిత్యయోగమున నిష్ణాతుడగు సహృదయ యోగీశ్వరుడె యిట్లుస్వానందముదితుడు కాగలడు.

ఇంతగాసిది మహాయోగి నిధ్యేయ మయినను చేతనాచేతన వశీకరణ పటుత్వ మహాత్మ్యము కలదని లోకప్రసిద్ధి యున్నది.

## గా న ర స ము

శిశుర్వేత్తి పశుర్వేత్తి
వేత్తి గానరసం ఫణిః

అని యభిజ్ఞులనిరి. శిశువులకు పశువులకిది యంత సుగమమేమి?
మనకజ్ఞాతముగా నొక రసప్రవణతా శక్తి గానసరస్వతీ ప్రసా
రమున నున్నది. జడాజడముల స్పంద శక్తులు. దీని ప్రస్పం
దమున క్షణము ప్రతిరుద్ధము లగును. ఆ ప్రతిరోధమె జడా
జడములకు భావసమాధి నిచ్చును. సమాధినుండి వెలికివచ్చి
నను శాంతపరిధినుండి యవి వెలికిరావు. ఇట్టి స్థితి సంపాదకత
గానమందున్నదని శిశునాగ పశువులకది తెలియు నందుమా?
నే నొకటి యందును. గానదేవి, శివదేవి, శివశక్తుల యీ సరస
రస ప్రవృత్తి గానసరస్వతీ సృత ప్రసృత మయినదని శిశువుకు
మార దేవుకు తెలియును. పశువగు వృషభస్వామి తెలియును.
కంకణీకృత హారీకృత నాగరాజు తెలియును. శిశు పశు నాగ
ముల నేనిట్లు భావింతును. ఇతరు లిట్లే భావింతురని యీ భావ
నాసంవిన్మహిమను గానసరస్వతి యందరకు ప్రసాదించునని
నేను నేనుగా స్వాశయ ప్రమోదము పొందుదునని, యొక
సారస్వత యోగి యనెను.

## వ ర్త మా న రీ తి

వర్తమాన గానవిలాసశ్రీలు ప్రాచీన సంగీత ప్రతినిధు
లనలేము. పరిష్కృతరూపములన లేరు. వికాసితస్వరూపము

లనజాలరు. గాన ప్రయోగ ప్రచారములు కేవల మర్థములకే యగుచున్నవి. నాదసంగీతచర్చలలో పురుషార్థసాధనము లని ముక్తిప్రాపకవిద్యలని, ప్రస్తారములు తెచ్చుట యున్నది. నవ సంగీతమునకు శతవత్సరవ్యాప్తి యున్నది. పురుషార్థచింత రాలేదు. ముక్తిప్రశ్న దూరముననె యున్నది. పాదుపాల సంగీతగోష్టి మనోరంజనకళ యయినది. అది హీన మనో రంజన కుండమున జేరినది. నారదపర్వతులులేరు. రైభ్యుడు లేడు. హాహాహూహూ కన్పడడు. జనకుడెక్కడనో గాన మున మోక్షపథ విహారి. వర్తమానకాల భావగీతములు భావోద్బోధన సమర్థములై గానరుచి సంపాదించు సమయ మింకను రాలేదు. శాస్త్ర శుద్ధ సంగీత మపేక్షితమగుటలేదు.

"గాయతే బ్రహ్మచారిణే న దేయం"

అని సంగీత సూత్రము కాదు. బ్రహ్మచారిగాన మొన ర్చుచు బిచ్చమునకు వచ్చిన భిక్షము పిడికెడయిన నీయరా దట, వాడేమిచేసెను? గానమేమి చేసినది? అదికాదు వాడు పాడరాని రాగములు పాడుచు వచ్చిన బిచ్చమీయ వలదని తదర్థము. విస్వరవిశ్రుతి రాగములను వినరాదు. దానివలన గాయకునికే కాక వినువారికిని ఆత్మహాని యున్నదని పెద్దలనిరి. రాగదోషములు రోగవిశేషముల నిచ్చును. శాస్త్ర శుద్ధ సంగీతమున నిట్టి యాపదలురావు. వైదిక సంగీతమున సదాత్తత యున్నది. ప్రాతర్మధ్యాహ్న సాయంసవనము

లందు మంత్రముల శ్రుతిమధుర గానము జీవనాడులను కదలించును. హృదయతంత్రుల పలికించును. తాంత్రిక గానముదాత్తపథమునుండి జీవునకు జీవనరసాయన మిచ్చినది. షట్చక్రకుండలినీ జాగరణము సంపాదించినది. సప్తస్వర సహాయమున యోగానుభూతి నిచ్చినది. ప్రపంచధ్వను లన్నియు సంగీతములోని సప్తస్వర సహితములై యున్నవి. విశ్వ విశ్వము సంగీతమయము. విశ్వసంచలనమున, గల సంగీతమె గ్రహతారా నక్షత్రాదులను నియతి చక్రమున కూర్చుచున్నది.

## గాంధర్వ గానము

ప్రకృతి జీవముల కన్నిటికి స్వరములతో సంబంధము కలదు. మయూరము గోవు మేక క్రౌంచము కోకిల గుఱ్ఱము కుంజరము సంగీత స్వరములను తమవి చేసికొనినవి. శరీర వ్యాయామమువలె కంఠ వ్యాయామమును కావలెను. సంగీత మూలశ్రుతులెవని కంఠమున సంపూర్ణముగ పలుకునో యాతడు నాదయోగి. మానవ దేహమున సంపూర్ణముగ పలుకవనియేమో— "వీణాయా మేష సంగ్రహః—" యని శాస్త్రకారు డనినాడు. వీణలోనవి వినబడునేని యాత్మవీణలో వినపడితీరును. విశ్వవీణలోని నిత్యస్వరములు నప్పుడు వినబడును. గంధర్వ కిన్నరులు సంగీతమున జీవనలీల సరిజూచుకొనినారు. సంగీతమున జీవనము సమర్పించు

వారి విశేషమున సంగీతము గాంధర్వవేదమయినది. యక్ష గంధర్వ సిద్ధ సాధ్య కిన్నరకింపురుషులందరు సంగీతోపాసకులు, గాంధర్వమని గానమని గీతమున రెండు భేదములున్నవి. చిర కాలముగావచ్చు సంగీత సాంప్రదాయము దీని ద్వారమున కొంత రక్షితమయినది. గాంధర్వమన్నది పరంపరా ప్రాప్తము కళ్యాణప్రదము. శ్రుతిహృదయ మోహానము. గానము వాగ్గే యకార రచితము. అని బద్ధరూపమయిన దేశీగానమును సుని బద్ధముచేసి వారు శాస్త్రీయత కూర్చిరి. గాంధర్వవేదము లుప్త మయినది. పునరుద్ధరణము శక్యమగునా? నాద బ్రహ్మోపాస కులు రాగమున కొకరుగా కొంతకాలమారాధించిన గంధర్వు లెవచ్చి యందింతురు. గాంధర్వ గంధమేని కలుగును.

## స్వర భాగ్యము

సంగీతస్వరసప్తకమున పంచస్వరములు ప్రధానముల యినవి. మరిరెండు గౌణములయినవి. ప, ని, స్వరముల ప్రధా నములని కొందరందురు. ధ, ని, స్వరములె గౌణములనియూ కొందరందురు. కాగా, మ, గ, రి, స, ధ, స్వరములు ప్రధాన స్వరములు. కంఠము, తాలువు, ఓష్ఠము, మూర్ధము, దంత ములు స్వరపంచకస్థానములు. ఈ స్థానములె అ, ఇ, ఉ, ఋ, ౡ పంచవర్ణస్థానములు. పంచవర్ణములు వర్ణసమామ్నాయమున మూలములు. పంచస్వరములు గీత సమామ్నాయమున మూలములు. అందుచేవానికి వీనికి సంబంధ మూహింపగలము.

అవియు స్వరములు. ఇవియు స్వరములు. అన్నియు స్వయం విరాజమానములు. ఇట్టి విరాజమానతకు హృదయగతమైన మధ్యమావాక్కు హేతువు. అందలి స్పందము దేహగత నాడులందొక పూరణము సంపాదించును. మనఃసంకల్ప భావిత మయిన యానాడుల నిండుతనము విశ్వదేహమున నాదసంచారమున కవకాశమిచ్చును. అప్పుడు గాయకుడు తనదేహములో నేస్థలములోని స్పందము నయిన స్వరభూమికి రాఁబట్టఁగలడు. ఇట్టితీర్థ ప్రదేశము నాడీయోగము కలవానికిగాని కలుగదు. వాద్యము గీతము నృత్యము మూడునుమిళితములయిననె సంగీత మనవలయును. వీనిలో నేదిలోపించినను సంగీతమున లోపము న్నది. సమరసమున నుండవలసిన యీ త్రితయములో నేది యధికమయినను సంగీతముపై నేదియొ మోపినట్లెయగును. స్వరసంచారములో నన్నియు నన్ని వేరువేరుగానున్న చు వాని యందన్నిటను భారతీయులు అభిన్నస్వభావము నవగతము చేసి కొనినారు. అనంతములందేకత్వమును సంధానించుటయున్నది సరస్వతిప్రసాదించినభిక్ష. పురుషగానముగాని తరుణీగానము గాని దేవముఖమయిన గానమయిననె ధర్మప్రసారముకూడిన గానమయిననె మోక్షపథికమయిన గానమయినను గానమునకు గాయన గాయనీ వ్యక్తులకు గౌరవగానము లభించును. ఏవం విధరీతియందే వృత్తిసౌకర్యమును గలుగును. అర్చాసమయ ములందు పూజాసమయములందు గాననాట్య వాద్యముల ప్రసారము జీవితపాత్ర నమృతధారలతో నింపించును. బృంద

గాన వైభవములు సామూహిక చేతనావికాసమున కుపకార ములు. దేవధర్మముఖోన్మేషములో గానసరస్వతి యవిలుప్త యగును.

## ఛందస్సరస్వతి

శబ్దముల యనంత ముఖములందలి యేకముఖత్వాను సంధానమునకు ఛందస్సుపయోగించును. ఛందమన్నది వేదచరణము. గాయత్రి వైదికచ్ఛందస్సు. లౌకికచ్ఛందము లెన్నియో కలవు. వాని సమ విషమగతి ప్రగతులలో భేదము లెన్నియో కలిగినవి. ప్రస్తార భేదములలో ననంత రూపత కలిగినది. వైదిక శబ్దమేది యయినను ఛందోమయము. లోక ములోని యేమాట యయినను ఛందోమయము కాగలదు. లోకములోని యేశ్రుతి ధారయయినను గీతచ్ఛాయలో నున్న దేదియయినను ఛందస్సంబంధమున నుండక తప్పదు. ఛందస్సు నందు గీతమున్నది. గీతములో ఛందస్సున్నది. అన్నిట సర స్వతి పదవిన్యాస మొనర్చినది. వర్ణచ్ఛందములు మాత్రా ఛందములను భేదమున నున్న ఛందస్సులలో మార్గదేశీ విశేష ములు గోచరించును, వర్ణ చ్ఛందస్సులందు సమీకృతమయిన రాగరీతి యుండును. మాత్రాచ్ఛందము లందు స్వరప్రస్తార కల్పనల కానుకూల్య మిచ్చు విన్యాస ముండును. సరస్వతీ సామ్రాజ్యప్రసారములో నున్న వన్నియు పరస్పరము సంబంధ శోభతోడనే యుండును. పింగలి నాగుడు వేదచ్ఛందోవిధు

లన్నిటి దెలిసి భూమిపై విహరించు చుండెను. నాగాహారు డయిన గరుత్మంతుడు డచటకు వచ్చి పింగలనాగు నొడిసి పట్టుకొనెను. కుతికపట్టి నొక్కెను. నాగునకు విడిపించి కొనుట శక్యమయినది కాదు. నాగుడు నిర్విణ్ణుడయి గరుత్మంతు నెంతయు వర్థించెను. "నా కాహారము దొరికినది. నాకిదిపండుగ. నా పండుగ భోజనమునే నేలవిడుతును." ఇట్లని వైనతేయుడు విడువనేలేదు. పింగలనాగు డనెను. వైదిక చ్ఛందమంతయు నాలోనున్నది. నన్ను మింగిన వేదచ్ఛందస్సంతయు పోవును. అపార శాస్త్రము పోవును." అని వైనతేయున కాసక్తి కలిగినది. ఛందము తెలియవలెననుకొనినాడు. ఏదీ చెప్పుము. నేను వినుదు నని నాడు పింగల నాగుడు న విశేషముగ ఛందశ్శాస్త్ర మంతయు వర్ణించెను. వాని గతులు నిరూపించెను. సముద్రతీరమున ప్రస్తారములు ప్రస్తరించెను. అంకెలువేసి చూపుచు చూపుచు సముద్రము దరిచేరెను. నాలుగు యగణములతో నుండు వృత్తమును గమన విశేషమున సూచించుచు నొక నవ్వు నవ్వి సాగర మార్గమున స్వస్థానము పాతాళము చేరెనట. అది భుజంగప్రయాతమను వృత్తమయినది. గరుడస్వామి పోనీలె! యనుకొనెను. తాను నవముగ ఛందస్సు తెలిసికొనిన సంతోషమున గరుడ ప్రయాతమును గగన మార్గమున సాగించియుండు. పింగలనాగుడు వైదిక ఛ్ఛందమును లౌకిక ఛ్ఛందమును గూడ సూత్రించి నిరూపించెను. అతని సూత్రములలో మొదట మాదిగణము లున్నవి.

| | | |
|---|---|---|
| ధీశ్రీస్త్రీమ్ | = | మగణము |
| వరాసాయ్ | = | యగణము |
| కాగుహార్ | = | రగణము |
| వసుధాస్ | = | సగణము |
| సాతేకత్వ్ | = | తగణము |
| కదాసజ్ | = | జగణము |
| కింవదభ్ | = | భగణము |
| నహాసన్ | = | నగణము |

ఇవి గణాష్టక లక్షణ సూత్రములు. ఆసూత్రాక్షరముల గురులఘు విన్యాసమె యాయాగణలక్షణముదాహరణమును వీనినిట్లు చెప్పుటలోని నిగూఢార్థమును వ్యాఖ్యాతలు చెప్పిరి. భావింపుడు!

అధ్యయమున "ధీ" కలుగును. ధీవలన వానికి "శ్రీ" యుండును. శ్రీ యున్న "స్త్రీ" లాభము. స్త్రీ సాధనోపాయ మార్గములన్నిటిలో ధీ మార్గము మంచిది. "వరాసా" అప్పుడు శిష్యుడాసక్తుడై ధీ స్థానమేది? "కాగుహా" యని ప్రశ్నించెను. "వసుధా" పృథివియందే ధీ లభించును. విషాదము వలదని గురువనెను. మీరుపదేశించు "ధీ" ఎచటనున్న లభించును? "సాత్ కత్వ". గృహి పురుషుడు 'ధీ' ఎపుడు పొందగలడు? "కదాస". ఏమి యొనరించుచున్న 'ధీ' లాభ

మున్నదో చెపుడు. "కింవద" యని శిష్యు డాసక్తితో నడిగెను. "నహాసన్" హాసాదిచాపల్య మొనరింపకున్నచో ధీలాభమున్నదని గురుబోధ. ధీవనమిదియందరిది. గీరాజ్యమది యందరిది. అధికారమది మన యందరిది. అర్హులు సమర్హులు స్వాత్మస్వరూప స్వభావ గౌరవముల గుర్తించి సరస్వతీ సామ్రాజ్య వైభవము పొందుదురు. విశ్వమున వైజ్ఞాని కైక్యము వాగీశ్వరి యధీనము.

యా దేవీ సర్వభూతేషు సర్వరూపేణ సంస్థితా
సరస్వత్యై నమస్తస్యై నమస్తస్యై నమోనమః.



